# అపురూప విందు...!

భార్యా, పిల్లల్తో సుఖంగా సంసారం చేస్తున్న డాక్టరు మహాశయుడు అనుకోని విధంగా మరొకరి బేగం సాహెబాకు 'నాలుగో మొగుడు' అయ్యేడు. ఓ రెండేళ్ళపాటు ఆవిడతో ఇంద్రభోగాలనుభవించేడు ... అలాంటిది ఓ సుదినాన ఆవిడను ముక్కలు ముక్కలుగా నరికించి, మసాలాలతో మహారుచిగా వండించి ఆప్తమిత్రులకు విందు భోజనం వడ్డింపించేడు...ఎందువల్ల?

'విపుల' మే నెల సంచికలో సాదత్ హసన్ మంటో ఉర్దూ కథ 'విందు భోజనం' చదవండి.

వివిధ భాషల వైవిధ్యంగల అనేక కథలతో పాటు మరెన్నో జోకులు, కార్టూన్లు, విచిత్ర విశ్వ విజ్ఞానం అందజేస్తోంది విపుల. తెలుగు పత్రికా పాఠకులకు గర్వకారణమైన విశ్వకథా విపంచి 'విపుల'... రంగుల ఆఫ్‌సెట్ ముద్రణలో 132 పేజీలు... 125 పైసలే!





Marketed By

**Margadarsi Marketing**
PRIVATE LIMITED
Eenadu Compound, Hyderabad-500 004

ప్రతి నెలా
1వ తేదీకి వెలువడే
విశ్వకథా విపంచి.

**విపుల**

పొత్తూరి శ్రీనివాసరావు

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :

[1938—1972]

శుక్రవారం : 9-5-'80

రౌద్రినామ సం. వైశాఖ బ. నవమి

సంపుటము 73 : సంచిక 37

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40

ఆరు మాసాల చందా రు. 24-70

విడి ప్రతి వెల 90 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ-520 003

విషయానుక్రమణిక

ఆట్టమీద బొమ్మ :

'కంచి కామాక్షి' లలిత

కథలు సీరియల్ కథలు :

కాంచన గంగ ... 8

స్వయంవరం ... 16

రేపటి నిర్మాణం ... 34

వ్యాసాలు, శీర్షికలు :

లోకం పోకడ, ఉత్తరాలు — 6, ధర్మపథం-14, బొమ్మలమహాభారతం 15, సినిమా — 24, ప్రశ్నావళి — 33, వారఫలం — 40, వంటలు — 42, ఫలక్నుమా నిద్దైరి — 45, హైదరాబాద్ నోట్‌బుక్—46.

# జీవితములో చిన్న సరదాలకి యెట్లా పొదుపు చేయాలి



మీ బిడ్డ కళ్ళలో వెలుగు, మీ కుటుంబము ఎంతో కాలము నుండి అనుకుంటున్న విలాస యాత్రలు మొదలగు చిన్న సంతోషములు మీ జీవితానికి ఒక అర్థమును యిస్తాయి. వాటికోసము మీరు వయస్సులో వున్నప్పుడె కెనరా బ్యాంక్‌నందు **నిరంతర డిపాజిట్‌లో** పొదుపు చేయుటకు ప్రారంభించండి. ఎంత చిన్న మొత్తమునయినా ప్రతినెల సరిగాగాని, లేక పెద్ద మొత్తము ఒక్కసారిగాగాని పొందుపరిచిన భవిష్య జీవితమునకు అదనపు ఆదాయము. త్వరలోనే ప్రతి సంవత్సరము కెనరా బ్యాంకు మీకు సొమ్మును నిరంతరము తిరిగి నెలవారిగా చెల్లించును.

అధిక సుఖ సంతోషములకు, ఉద్యోగ విరమణ అనంతరము సుఖ జీవితమునకు డబ్బు తరగని ఆధారము. పైగా మీరు పొదుపు పరిచిన మొత్తము మీరు కోరినప్పుడు మీకు యివ్వబడును. జీవితములో అధిక సుఖములను కోరు యువజనుల కొరకే దూరదృష్టితో కెనరా బ్యాంకు వారు **నిరంతర డిపాజిట్టును** యేర్పరిచిరి.

మీకు దగ్గిరలో వున్న కెనరా బ్యాంకు శాఖకు వెళ్ళి వివరములను తెలుసుకొనండి.

మా ప్రత్యేక ప్రణాళికలు
**కామధేను, విద్యానిధి, బాలక్షేమ**

## నిరంతర డిపాజిట్

## కెనరా బ్యాంక్




(జాతీయ బ్యాంక్)
1200 పైగా శాఖలు
దేశమంతటా కలవు.

maa CB 2 B Tel 80

లోకం పోకడ * ఉలిమెక్










# ఉత్తరాలు

## కథలు

'ఉద్యోగము చెయ్యను' కథ యువతరానికి ఆదర్శ ప్రాయము కాగలిగితే ఎంతబాగుణ్ను. అంత చిన్న కథలో రచయిత తన సందేశాన్ని సూటిగా చెప్పగలిగాడు. విశ్వాసపాత్రుడైన నౌకరు [ఉద్యోగి] అభిమానం వదులుకుంటే తానొక్కడు బ్రతగ్గలడు. స్వయం ఉపాధి కల్పించు కోగలిగిన వాడు పదిమందిని బ్రతికించగలడు, అనే సత్యాన్ని అందరు తెలిసికోవాలి. హార్స్ సెన్స్ కథ సహజత్వానికి దగ్గరగా ఉంది.

శశి [నెల్లూరు]

* * *

జయశ్రీ టి గారి ముఖచిత్రంతో వెలువడిన 11—4—80 పత్రిక ఆకర్షణీయంగా లేకపోయినా ఆనందింపజేసింది.

ప్రచురించిన రెండు కథలూ ఎంతో బావున్నాయి. పులిపులి, కార్తీకం కవితలు చిన్నవైనాభావయుక్తంగా బావున్నాయి.

కాయితాపురం ఉపేందర్ రెడ్డి, పొలసెట్టి రాజా, కల్పన,మల్లికార్జున్, బ్రమరాంబ, చెన్నయ్య [జనగామ]

## సీరియల్

18—4—80నాటి పత్రికలో తాళ్ళూరి కృష్ణకుమారి, చంద్రమోహన్‌ల జంట చాలా చూడముచ్చటగా ఉంది. ఈ వారం స్వయం వరం సీరియల్ చదువుతున్నంతసేపు నేను అమరావతి, మంగళగిరిలో వున్నట్లనిపించింది. రచయిత చివుకుల పురుషోత్తంగారు చాలా అద్భుతంగా వర్ణించి వ్రాశారు. తరువాయి భాగానికి ఒక వారము ఆగలేక చస్తున్నానంటే నమ్మండి.

జె. బసవరాజు [మొలగవల్లి]

* * *

తాళ్ళూరి కృష్ణకుమారి, చంద్రమోహన్ ముఖ చిత్రాలతో వెలువడిన 18—4—80 ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాల అందంగా ఉంది. సినిమా విశేషాలలో కలర్ ఫోటోలు వేసే పద్ధతి నచ్చింది. కాంచనగంగ సీరియల్ బాగుంది. జోక్స్ సంఖ్య పెంచాలనిమనవి.

పుప్పాల వాసుదేవరావు [శ్రీకాకుళం]

(50వ పేజీ చూడండి)

## రైటప్

2—5—80 తేది సంచికలోని 25వ పేజీలో ప్రచురించిన చిత్రాలలో "సీతాదేవి శ్రీరామ చంద్రునికి కనిపించకుండా దాగుకొనుట" చిత్రాన్ని శ్రీ నరసింహమూర్తిగారు, "కౌసల్యా నందవర్ధన" చిత్రాన్ని శ్రీమతి విజయలక్ష్మి గారు వేశారు.

— సం.

సీరియల్

# తాపవనగంగ

సుధాగౌతమ్

(గత సంచిక తరువాయి)

**రవి** యింజనీరింగ్ పాసైన ఆరునెల్లలోనే పి. డబ్ల్యు. డి. లో జూనియర్ యింజనీరుగా ఉద్యోగం దొరికింది. అతడి సంతోషానికి పట్టపగ్గాలు లేవు. ఆర్డర్ రాగానే ఒక్క పరుగున వెళ్ళి అపర్ణ కాలికి నమస్కారం చేశాడు.

అపర్ణ పెద్ద బాధ్యత తీరిపోయింది. తన స్వహస్తాల్తో పెంచి పెద్ద చేసిన చెట్టు పూచి కాయలు కాసే ఘట్టానికి వచ్చిందంటే ఎంతటి సంతోషం. తండ్రి జ్ఞాపకం వచ్చి కళ్ళు చెమరాయి. ఈ రోజు తన తండ్రి బ్రతికుంటే ఎంత సంతోషించేవాడో.

అక్కయ్య తన కోసం ఎంత కష్టపడింది? ఎన్ని అవమానాలను సహించింది. చివరకి ఎంత త్యాగం చేసింది? ఆమె స్థానంలో ఉన్న మరే ఆడదైనా, అంత త్యాగం చేసి ఉండేది కాదు. కట్టుకున్నవాడితో రాజీపడి, తమను వీధిన వదిలేసి ఉండేది.

రవికి ఉన్న ఊర్లోనే ఉద్యోగం కావడం వలన, అపర్ణకి యింకా పని సులువుగా ఉంది. ఇక రజని బాధ్యత మాత్రం తనపై ఉంది. రజని యిప్పుడు బి. యస్. సి చివరి సంవత్సరం చేస్తోంది. యం యస్. సి. చేస్తానంటోంది. దన్నుంచి తనకయ్యే యిబ్బంది ఏమీలేదు. ఉన్న ఊళ్ళోనే యూనివర్శిటీ ఉన్నదాయె. ఆ తర్వాతే రజని పెళ్ళి గురించి ఆలోచించవచ్చు.

* * *

ఆ రోజు ప్రాక్టికల్స్ ఉన్నాయనీ, తను రావడం లేటు కావొచ్చనీ పెందలాడే వెళ్ళిపోయింది రజని. అయ్యర్ కూడా వంట వండేసి వెళ్ళిపోయాడు. మరలా సాయంత్రం దాకా రాడు. సుజన్‌ని డ్రయివర్ డేవిడ్ తొమ్మిదిన్నరకే కాన్వెంట్‌కి తీసుకెళ్ళాడు. మరీ మధ్యాహ్నం ఒంటి గంటకు వచ్చి బాబుకి క్యారియర్ తీసుకెళ్తాడు.

అపర్ణ రావడం కూడా ఇక ఆ సమయానికే. ఏదైనా ఆపరేషన్ కేసుంటే మాత్రం ఏ మూడు గంటలో అవుతుంది. అందుకనే అయ్యరే సుజన్‌కి క్యారియర్ కూడా సర్దేసి వెళ్ళిపోయాడు.

రవి మాత్రం తలనొప్పి ఎక్కువగా ఉండడం వల్ల, ఆఫీసుకు సెలవు పెట్టి యింట్లోనే ఉండిపోయాడు. పనిమనిషి లక్ష్మి కూడా అయ్యగారింట్లో ఉండటంవల్ల, మధ్యాహ్నం వస్తానని చెప్పి రవి పర్మిషన్ తీసుకుని వెళ్ళిపోయింది

ఆ రోజు హాస్పిటల్లో పని ఎక్కువగా లేనందువల్ల అపర్ణ పన్నెండు గంటలకే యింటికి వచ్చేసింది. మామూలుగా ఐతే డేవిడ్, ఒంటిగంటకు కారు తెస్తాడు. డేవిడ్ అంతవరకూ రాడు. అందుకే రిక్షా చేసుకుని యింటికి వచ్చింది. ఆ రిక్షా డ్రైవరు కూడా యింటికి ఫర్లాంగు దూరంలో బరస్టు కావడంతో కాలినడకన యింటికి వచ్చింది.

నెమ్మదిగా హాల్లో అడుగు పెట్టబోయిన అపర్ణ, రవి గదిలోంచి ఆడ గొంతు వినపడటంతో అల గేచాటున ఆగిపోయింది ఒకింతం రంగనాథం మేష్టారుగారమ్మాయి, రమదిలా వుంది. రంగనాధం మేష్టారు మునిసిపల్ మిడిల్ స్కూల్లో టీచరు. ప్రక్క బంగళాలోని ఔట్ హౌస్‌లో అద్దెకుంటున్నారు. ఆ బంగళా కంట్రాక్టరు కామయ్యగారిది.

రంగనాధం మేష్టారు బ్రతుకున పేద కావొచ్చు కానీ, గుణానికి, కులానికీ మాత్రం పేదకాదు. అతనికొచ్చే జీతంతో సంసార రథం నెట్టుకు రావడమే బ్రహ్మ ప్రళయం మేష్టారికి. సంతానంలో పెద్ద అమ్మాయి రమ మిగతా ముగ్గురు అబ్బాయిలు చిన్నవారు. పస్తులుండాల్సిన రోజుల్లో అభిమానం, పౌరుషం చంపుకుని ఎన్నోమార్లు తనవద్ద చేబదులు తీసుకున్నారాయన. ఆయితే ఏనాడూ తిరిగి యివ్వకుండా ఉండలేదు. తను వద్దన్నప్పుడు అతడి అహం దెబ్బ తినేది. అందుకే అడిగినప్పుడల్లా యిచ్చేది. కానీ, తిరిగి యిచ్చేటప్పుడు ఏమీ మాట్లాడేదికాదు తను ఆ ముసలి ప్రాణాన్ని కష్టపెట్టడం యిష్టంలేక.

రంగనాధం మేష్టారిలో తనకు ఎప్పుడూ తన తండ్రి కనబడేవాడు. అదే ఆయనకూ తనకూ ఉన్న బంధం!

మేష్టారిగారమ్మాయి రమ చక్కటి చుక్క. బి. ఏ పాసై బి. ఇడి చేస్తోంది. మేష్టారుగారి ఆశలన్నీ ఆ అమ్మాయి మీదే. తనూ ఎన్నోమార్లనుకొంది, ఆ అమ్మాయిని రవికి చేసుకొంటే మేష్టారుగారి బరువూ తగ్గుతుంది. రవీ రమల యీడూ జోడూ చూడముచ్చటగా ఉంటుంది. అమ్మాయి

---

జరిగిన కథ - : 5 'గులాబీకి ముళ్ళుందుకుంటాయి' అన్న సమస్యను డాక్టర్ సిలియ, సిస్టర్స్ దీనా, ఫాతిమాలతో అపర్ణ చర్చిస్తూండగా, అబార్షన్ అయిన ఒకామెను ఆమెతల్లి అక్కడకు తీసుకువస్తుంది. కట్నం బాకీపడ్డ కారణంగా ఆమెభర్తతంతే ఈ విదంగా జరిగిందని చెబుతుంది. ఆమెను ఆపరేషన్ చేసి కాపాడిన అపర్ణ ఆలోచనలు గతంలోకి పరుగెడుతాయి. తాలూకా గుమాస్తా పరంధామయ్య, విశాలాక్షిలకు అపర్ణ, రవి, రజని సంతానం. అన్నింటిలోను ముందుండే అపర్ణను ఉన్నపాలంగా మెడిసన్‌లో చేర్పిస్తాడు పరంధామయ్య. అనుకోని విధంగా పరిచయమైన డాక్టర్ శ్రీధర్, అపర్ణ మనస్సులో చోటు చేసుకుంటాడు. అపర్ణ ఆశయాలను, బాధ్యతలను స్వీకరించి, పెండ్లి చేసుకొంటానని ఆమెతో చెప్తాడు శ్రీధర్. శ్రీధర్, అపర్ణల పెళ్ళి అయిన అనంతరం పరంధామయ్య మరణిస్తాడు. ఆ తరువాత శ్రీధర్‌లో వచ్చిన మార్పును చూసి సహించలేక పోతుంది అపర్ణ. శ్రీధర్‌తో తెగతెంపులు చేసుకొని, తన వాళ్ళని తీసుకొని వెళిపోయిన అపర్ణ మీరా సహాయంతో 'పెద్దసర్జన్' అవుతుంది. ఆమెకు కొడుకు పుడతాడు.

---

చదువు చాలించమని ఊరుకుంది తను. చూపులను బట్టి రవి మనసు కూడా ఆ అమ్మాయి మీదేనని పసిగట్టింది తను. రమ ఉద్యోగంచేసి సంపాదన తన తండ్రికే యివ్వవచ్చు, మిగతావారు నిలదొక్కుకునే దాకా అని కూడా ఆలోచించింది.

రమా, రవీల సంభాషణ స్పష్టంగానే వినబడుతోంది తనకు. అంతవరకూ ఏం మాట్లాడుకున్నారో తనకు తెలియదు కానీ అప్పుడు తనకు వినబడింది యింతే!

"మా నాన్న నిక్కచ్చిగా ఏమిటి, అసలు కట్నం యిచ్చుకోలేరు రవీ" నన్ను చదివించడమే ప్రళయంగా ఉంది.

"అలా అంటే ఎలా రమా! అక్కయ్య కాదనదు కానీ, నేనే యిస్తే బాగుంటుందనుకుంటాను. అక్కయ్య నన్ను ఇంతవాణ్ణి చేసి చదివించింది. యిప్పుడుద్యోగం చేస్తున్నాను. మన పెళ్ళయ్యాక కూడా అక్కయ్యని బాధ పెట్టడం యిష్టం లేదు నాకు. ఈ రోజు కాకపోతే రేపు ట్రాన్స్‌ఫర్ అయి మనం దూరంగా వెడితే, నా జూనియర్ ఇంజనీరు సంపాదన యింత? పిల్లలొస్తే మరీ కష్టం కదా... కట్నం డబ్బులు నాలుగు బ్యాంకులో వేసేస్తే ముందు ముందు మనకే పనికొస్తుంది. మీ నాన్న మా అక్కయ్యకేం యివ్వడం లేదుగా. నీకేగా యిస్తుంటా. యింతకీ నువ్వొక్కతేగా కూతురువి. యిస్తేనేం? మిగతా ముగ్గురు కొడుకులు మూటలు తెస్తారులే.."

ఎందుకనో రవిలో శ్రీధర్ స్వరూపం కనిపించింది అపర్ణకు. ఛీ, ఛీ అనుకుంది.

తన తమ్ముడిలో ఇంత స్వార్థం ఉందనీ, ఇంత ఆశ వుందనీ తను కలలో కూడా ఊహించలేదు. తాను చేతితో పెంచిన పూలతీగ యిలాంటి విషపు పువ్వుని పూస్తుందనుకోలేదు. ఆ పువ్వుని మొగ్గలోనే తుంచేయాలి.

ఏమీ బదులు చెప్పలేక రమ వెళ్ళొస్తానంటూ లేచింది. ఆ అమ్మాయికి కనబడకుండా చాటుకు తప్పుకొంది అపర్ణ.

* * *

మర్నాడుదయం బ్రేక్‌ఫాస్ట్ అయిం తర్వాత, డేవిడ్‌కి సుజన్‌ని భద్రంగా కాన్వెంట్‌లో వదలమని చెప్పి నడకన బయలుదేరింది అపర్ణ ఆస్పత్రికి. కారు రిపేర్‌కి పోయింది. రావడం రెండ్రోజులు పట్టవచ్చు. రవి యిప్పుడు స్కూటర్ కొన్నాడు.

రజనీ అయ్యర్‌కి వంటా, మధ్యాహ్నం టిఫినూ ఏం చెయ్యాలో చెప్పి, ఉతికే బట్టల్ని పెరట్లో పారేసి యిల్లు జాగ్రత్తగా చూస్తుండమని పనిమనిషి లక్ష్మితో చెప్పి కాలేజీకి బయలుదేరింది.

అపర్ణ పోతున్నదల్లా ఆగి రవిని కేకేసింది.

స్కూటర్ని అలాగే నెట్టుకుంటూ ఆమె వద్దకు వచ్చాడు.

"యింకా ఆఫీసుకి టైముందా రవీ"

"ఆఫీసు పదిన్నరకి, యింకా రెండు గంటల టైం ఉంది" ఎందుకన్నట్టు చూశాడు.

"అయితే నాతోపాటు హాస్పిటల్‌కిరా. నీతోకాస్త మాట్లాడాలి" రవికి బర



వొచ్చి అవకాశం లేకుండా స్కూటర్ వెనకాల ఎక్కి కూర్చుంది.

కారణం ఊహించాడు రవి. క్రిందటి సారి రమ వెళ్ళిన రెండు నిముషాల్లోనే అక్కాయ్ వచ్చేసింది. గొంతులో వచ్చి వెలక్కాయ పడ్డట్టు తిక్కురుమనకుండా స్కూటర్ స్టార్ట్ చేశాడు రవి. క్షణాల్లో దూసుకుపోయింది.

* * *

పేషెంట్సందరినీ ఓమారు విచారించుకుని వీలిమకు ఉన్న పనికాస్త వొప్ప చెప్పింది. ఆరోజు, ఓ.డి యస్. పీ మాత్రం ఉంది. అది వీలిమే చేస్తుంది.

రవి పరిస్థితి ముళ్ళపై కూర్చున్నట్టుంది. బల్లమీది ఫామిలీ ప్లానింగ్ మేగజైన్ తీసుకుని తిరగేస్తున్నాడు. దాన్నిండా "హారతికో అమ్మాయి, కీర్తికో అబ్బాయి" "అప్పుల పాలవడానికో అమ్మాయి, పప్పులు తినడానికో అబ్బాయి" లాంటి స్లోగన్లే !

నిజమే. ఆ అమ్మాయి పుడితే తండ్రి అప్పుల పాలు కావలసిందే అనుకున్నాడు అప్రయత్నంగా !

నిన్న తను రమతో మాట్లాడిన విషయాలు జ్ఞాపకం చేసుకుంటున్నాడు. అంతలో అతని ఆలోచనలు అక్క లోపలికి రావడంతో కట్ ఐపోయాయి.

కుర్చీలో కూర్చుని రెండు నిముషాలపాటు మౌనంగానే ఉండిపోయింది. తర్వాత ఏదో

# కాంచనగంగ

ఆలోచించి ఇలా అంది... "నీవు రమని పెళ్ళాడ గోరుతున్నట్లు నిన్ననే తెలిసింది రవీ" రవి ఉలిక్కిపడ్డాడు. ఐతే రమ రావడం, తాము మాట్లాడడం అంతా అక్కయ్య వింటున్నమాట. రవికి కాస్త తికమక కలిగింది.

"చాలా సంతోషం రవీ, చక్కటి అమ్మాయినే ఎన్నుకున్నావు. రమ నీకన్ని విధాల తగిన భార్య. నేను కూడా అదే ఉద్దేశంతో ఉన్నాను నవ్వు ఆనిర్ణయానికే వచ్చావు"

రవి తను ఆ విషయం అక్క ఎదురుగా ఎలా చెప్పాలా అని సతమత మౌతున్నాడు ఇన్నాళ్ళూ. ఆ సమస్య యింత తొందరగా తీరిపోతుందనుకోలేదు.

"అయితే ఒక్క విషయం మాత్రం నన్ను చాలా బాధిస్తోంది రవీ..." ప్రశ్నార్థకంగా చూశాడు.

"నేను నీకేం తక్కువ చేశాను రవీ ?" ఆమె కంఠం కాస్త గద్గదికమైంది.

అనుకోని ప్రశ్న అతణ్ణి సూటిగా తాకింది.

"సాటి మనిషిని మంచితనంతో, మానవత్వంతో తూచి చూడాలికాని డబ్బుతో కాదని, నీ కెన్నిసార్లో చెప్పినట్టు జ్ఞాపకం."

"డబ్బును నేనెంతో సంపాదించాను.

డబ్బు [illegible]

డబ్బుకు విలువ ఎంత వుందో, అదే మనిషికి మనిషి హృదయం ముందు ఎంత విలువ లేనిదో నాకు తెలుసు రవీ... మనిషి డబ్బును సంపాదించవచ్చు కాని, డబ్బుతో మనిషిని కొనలేము. కష్టపడి సంపాదించి డబ్బుకే గౌరవమూ, విలువా... సులభంగా సంపాదించగలిగిన డబ్బుకు కాదు. కాని కొన్ని సందర్భాల్లో మాత్రం ఇది వెనక ముందూ ఔతుంది. ఉదాహరణకి, నీ అందగాడివి, చేతినిండుగా సంపాదిస్తున్న వాడివి. ఇంజనీరువి కాబట్టి ఏ అమ్మాయినైనా కొనెయ్యగలదు నిన్ను తలుచుకుంటే అంతెందుకు, ఇంత మంచివస్తువు మరి దొరకదనుకుంటే, రమ తండ్రి కొనెయ్యగలడు ఏ అప్పో సొప్పో చేసి. మిగతా పిల్లల చేతికి చిప్పనిచ్చి"

చాచి లెంపకాయ కొట్టినట్టయింది రవికి. అయితే అక్కయ్య తన మాటలన్నీ విన్నదన్న మాట తనలోని చిన్నతనాన్ని ఇంత నీచంగా బేరీజు వేసింది. అక్కకళ్ళకు ఇంత చులకనైపోయాడో ! నిజమే, తను పూల పొదులోని కలుపు మొక్క. సిగ్గుతో తలెత్తలేక పోయాడు.

"అప్పుడు ఆ అమ్మాయి ముందు నీవెంత చులకనైపోతావో, నిన్ను కొన్నందుకు ఆ అమ్మాయికి నీమీద ఎంత అధికారం ఉంటుందో కాస్త ఆలోచించుకున్నావా ? నిన్ను నేనింతవాణ్ణి చేసింది "ఓ సరుకు"గా మార్కెట్లో పెట్టడానికి కాదు రవీ.. చాలా నిస్సహాయస్థితిలో ఉన్న ఓ అమ్మాయి జీవితానికి వెలుగునై దారి చూపడానికి ... కానీ నీలో కూడా ఈనాడు 'శ్రీధర్' తొంగి చూస్తాడనుకో లేదు. నన్ను వెక్కిరిస్తాడనుకోలేదు. నీవలా చేసిందే నిజమైతే, నేను నా సుఖాన్నీ, సంసారాన్నీ "నీలాంటి భర్తనూ వదులుకోవడంలో అర్థం లేదనిపిస్తుంది."

రవి వంచిన తల పైకెత్తి చూడలేక పోతున్నాడు.

"నీకలా డబ్బు అవసరం ఉండి ఉంటే నన్నడిగితే పోయేదిగా ! ఏనాడన్నా నీకు లేదన్నానా రవీ"

రంగనాథం గారి నుండి కట్నం ఆశించడంలో నీ ఉద్దేశమేమిటి? ఆర్థికంగా నిన్ను నేనలా డబ్బు కావాలని పటువంటి





# తెల్లదనానికి మొదటిది
# ప్రకాశానికి మొదటిది

TATA'S
501
BLUE DETERGENT BAR

# నీలం 501
## డిటర్జెంట్ బార్

"హెచ్చు
ఉతికే శక్తి!
హెచ్చు పొదుపు"



"ముద్ద కాదు, ఎక్కువ
రోజులు వస్తుంది.
పుష్కలమైన నురుగు!"

**మరొక 501 విజేత**

టాటావారి తయారీ

## కాంచనగంగ

పరిస్థితిలో ఉంచావనా, లేక అందరి యువకుల్లా కట్నం తీసుకోవడం వల్లనే నీ 'విలువ' లోకానికి తెలిసి వస్తుందనా? లేక నీలో ధనంపై అంత వ్యామోహం ఉందా? లేక స్వార్థమా? అదో ఫ్యాషనా?'

రవికి మాటలు రావడంలేదు బదులు చెప్పడానికి.

"ఆర్థికస్తోమతా, ఉద్యోగం, సంపాదనా అన్నీఉన్న నీలాంటి యువకులు కూడా డబ్బు నాశించడం, అదీ అమ్మాయి తండ్రి నుండి. అంటే నీవు నా తమ్ముడని చెప్పుకోవడానికి కూడా సిగ్గుగా ఉంది రవీ.

ఆ మాటతో సిగ్గుతో కుంచించుకు పోయాడు.

"రంగనాథం మేష్టారి స్థితిగతులు నీకేం తెలియదా... తెలిసీ రమతో అలా ఎందుకు మాట్లాడావు. నీవేమో తేలికగా మాట్లాడ గలిగావు. ఆ అమ్మాయి ఎంత బాధపడ ఉంటుందో, ఆ హృదయం ఎంత సంక్షోభానికి గురియై ఉంటుందో కాస్తన్నా ఆలోచించ గలిగావా?

అకారణంగా 'అవివేకపు పని చేశానే' అన్న ఫీలింగ్ కలుగుతోంది రవిలో.

తను చేసిన పని అక్కలో యింత అలజడి రేపుతుందనుకోలేదు. అక్కయ్య ముందునుంచీ అంతే, ఆమె వ్యక్తిత్వపు లోతుల్ని ఎవరూ కనుక్కోలేరు ఆమె సకల మణిరాసుల్ని, అనంత నిధినీ గర్భంలో దాచుకున్న గంభీర సాగరం. తాను మాత్రం ఓ పనికిరాని ఆల్చిప్ప!

"కట్నం తీసుకోకుండానే పెళ్ళాడతా వనే అనుకో. ఆ కట్టుకున్నదాని ముందు నువ్వు చేసిన ఘనకార్యాన్ని సందర్భం లేకుండానే పదే పదే ఆమెకు గుర్తు చేయడం, లేదా దెప్పిపొడవడం సంస్కారంకాదు రవీ. పురుషుడెప్పుడూ స్త్రీముందు అన్ని విధాలా అధికుణ్ణనిపించుకోడానికై తహతహలాడాలి కానీ, కుసంస్కారంతో అల్పుడిగా భార్య దృష్టికి ఏనాటికీ అనిపించకూడదు."

ఆమె మాటల్తో రవిలోని అవివేకపు, అజ్ఞానపు పొరలు ఒక్కొక్కటిగా విడిపోతున్నాయి.

"ఆడపిల్లల కన్న తండ్రిని పిండి తెచ్చుకునే రక్తం లాంటి ఆ కట్నం కలకాలం ఏ యువకుణ్ణీ పోషించలేదు రవీ. అలా అని శ్రీమంతుల బిడ్డకదా, యివ్వగలిగినప్పుడు ఎందుకు తీసుకోకూడదు అనుకోవడం కూడా మంచి సంస్కారవంతుడైన యువకుడి చిహ్నం కాదు. వారే యిచ్చినా, తనే 'అడుక్కున్నా' అతడు ఆ అమ్మాయికి అమ్ముడు పోయినట్టే. అందుకే అభిమానవంతుడైన యువకుడెప్పుడూ, అమ్ముడు పోయి యిష్టపడడు..." చాలా గంభీరంగా ఉంది ఆమె స్వరం.

"అమ్మాయి వద్దనుండీ ఏదీ ఆశించకుండా, అభిమానంతో, తన స్వసంపాదనతో ఆమెని పోషించిననాడే మగవాడికి గౌరవం! భార్యా భర్తల సంబంధాలు డబ్బుతో ముడి పడకూడదు. అనురాగంతో ముడిపడాలి. పురుషుడెప్పుడూ భార్య అంతరంగాన్ని అర్థం చేసుకోవాలి. ఆమెను అభిమానంతో ఆదరించి, పౌరుషంతో పోషించి, ఆమెకు జీవితాంతం చల్లని నీడగా నిలచి, ఆమెకు హృదయంలో స్థానాన్నీ, సంఘంలో మర్యాదనూ కలిగించిననాడు, ఏ స్త్రీ సమానత్వపు జోలికి పోదు. యువకులంతా అలాంటి సమాజాన్ని సృష్టించిననాడు, ఈ స్త్రీపురుష సమానత్వపు నినాదాలు, హక్కుల అర్థనాదాలూ ఎందామన్నా వినిపించవు. అలాంటి సమాజాన్ని, ప్రతి స్త్రీకీ సుఖసంతోషాల్నివ్వగలిగిన సమాజాన్ని సృష్టించే కర్తవ్యం నీలాంటి యువకులమీదే ఉంది రవీ..."

రవికి తను చేసిన పొరపాటు అర్థమవుతోంది ఉన్నట్టుండి వాచీవైపు చూశాడు. ఆఫీస్‌కి టైం అవుతోంది రవి ఏమీ మాట్లాడలేని మూగవాడై పోయాడు తన అక్క అనంతకోటి కిరణాలతో వెలిగి, సకల చరాచర జీవరాశికి జీవాన్నీ, జీవితాన్నీ, చైతన్యాన్నీ కలిగించే సూర్యబింబంలా కనిపిస్తోంది కళ్ళకు. తాను ఆ కాంతి పుంజం ముందు నిలబడ్డ మిణుగురు పురుగు.

"రమ విషయంలో అంతా నీకే వదిలేస్తున్నా నక్కయ్యా" అని మాత్రం అనగలిగాడు

అపర్ణ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తోంది. స్కూటర్ స్టార్ట్ అయినచప్పుడు విని, రవి వెళ్ళిపోయి ఉంటాడు అనుకుంది. రవి తన తమ్ముడు, ఏనాటికీ తన తమ్ముడే!

సరిగ్గా అప్పుడే సిస్టర్ దీప ఏదో చెప్పడానికని గదిలో కాలు పెట్టింది.

# కాంచనగంగ

రమా, రవీల వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది. ఈ పనేళ్ళలో తాను తగినంత పేరునూ, ధనాన్నీ ఆర్జించినా, పెళ్ళి మాత్రం అట్టహాసంగా చెయ్యలేదు అపర్ణ. అనవసరపు ఖర్చులు చేసి డబ్బు వేస్ట్ చేయడం ఆమె కిష్టంలేదు. పెళ్ళి అట్టహాసంగా చేయాలంటే లేనిపోని దండగ ఖర్చులు బోలెడుంటాయి. చెమటోడ్చి సంపాదించిన డబ్బును అర్థం లేకుండా తను ఖర్చు చెయ్యలేదు. డబ్బు విలువ తెలిసిన వారెవ్వరూ అలాటి దండగ ఖర్చులు చేయరాదు.

అందుకే పెళ్ళి తంతు చాలా సింపుల్‌గా జరిగింది. రంగనాథం వద్దనుండి కానీ కట్నం కూడా ఆశించలేదు. తీసుకోలేదు అపర్ణ. కనీసం రవికి వాచీ, ఉంగరం వంటి చిన్న కానుకలను కూడా తీసుకోనివ్వలేదు. పెళ్ళికి అతడి వైపునుంచికూడా ఏ దుబారా ఖర్చు చేయనివ్వలేదు.

రమను వదలి వెళ్ళేటప్పుడు మాత్రం, రంగనాథం దంపతులు అపర్ణ సౌజన్యానికీ, సహృదయతకూ తమ కృతజ్ఞత తెలపుకోకుండా ఉండలేక పోయారు. తమ కూతురి అదృష్టానికి మురిసిపోయ్యారు. అపర్ణలోని ఉన్నత ఆశయాలూ, ఆదర్శాలు వారినెంతో కదిలించాయి. ప్రపంచంలో ఆదర్శాలు చెప్పేవారూ, కలవారూ ఎందరో ఉన్నారు. వరకట్న పిశాచాన్ని పారద్రోలండంటూ, వేదికలెక్కి. ఉపన్యాసాలు చేసి వివాహాలు చేయండని బోధించే వారెందరో ఉన్నారు. కాని ఎంతమంది ఆ ఆదర్శాల్ని ఆచరణలో పెడతున్నారు? అపర్ణ అలాంటి ఉపన్యాసాలెవ్వడూ బహిరంగంగా చేయలేదు. కానీ నియమంతో ఆచరణలో పెడుతోంది. చేసేవారెన్నడూ చెప్పరు. అపర్ణ వారినుండి ఎటువంటి పొగడ్తలు గానీ, కృతజ్ఞతలు చెప్పుకోవడాలుగానీ ఆశించలేదు. అది మొదట్నుంచీ ఆమె స్వభావానికివిరుద్ధం.

చిరునవ్వు నవ్వేసి మాట మార్చేసింది. రమను వదలి వెళ్ళడం రంగనాథం దంపతులకుగానీ, తలిదండ్రులను వదలి ఉండడం రమకుగానీ పెద్ద బాధనిపించలేదు. "ఎంత దూరం అనుకున్నా, పుట్టిల్లు పక్క వాటాలోనే కదా. ఏడవకు" అంటూ రమను ఓదార్పులా అభినయించేశాడు రవి. అందరూ గొల్లున నవ్వారు రమ ముఖం సిగ్గుతో ఎర్రబడింది.

రంగనాథంగారు అపర్ణవద్దా, రవివద్దా సెలవు తీసుకుని వెళ్ళిపోయారు.

*　　*　　*

అపర్ణకు ఇక రజని బాధ్యత మాత్రం మిగిలింది.

కానీ, రజని పరధ్యానం, ఆమెలోని మార్పు గమనిస్తోంటే, రవిలానే అది కూడా ఏదో ప్రేమలో పడ్డట్టే అనుమానించింది అపర్ణ. రజని వయసులోనూ, మానసికంగానూ ఎదిగినఅమ్మాయి. తన కిష్టం వచ్చిన వారిని ప్రేమించే హక్కు ఆమెకుంది. రజనికి తను ఏ విధంగానూ అడ్డు చెప్పదు.

ఆ అబ్బాయి పేదవాడా ? గొప్పవాడా ? అన్న ప్రశ్న తనలో లేనేలేదు. కులమతాలతో తనకు ప్రమేయమే లేదు. రజని మనసారా వొప్పుకున్నప్పుడు తను అడ్డు పడడంలో అర్థంలేదు. కానీ అతడు విద్యావంతుడూ, సంస్కారం గలవాడూ, రజనిని జీవితాంతం తన జీవిత భాగస్వామిగా స్వీకరించి, సహృదయంతో ఆదరించే వాడయ్యుంటే తనకు మరింకేమీ అక్కర్లేదు. మరేమీ కోరదు. కానైతే అతడు రజని నుండి కట్నం ఆశిస్తే మాత్రం తను వొప్పుకోదు. తను యివ్వదు.

తన ఆశలూ, ఆదర్శాలూ, ఆశయాలూ, అభిప్రాయాలూ అన్నీ రజనికి తెలుసు. తన ఆశయాలకి విరుద్ధంగా రజని ఏనాటికీ ప్రవర్తించదు. రజని తెలివిగల పిల్ల. అంతగా ఏదైనా జరిగి కట్నం యివ్వాల్సి నటువంటి పరిస్థితే వస్తే తనుమాత్రం చచ్చినా చిల్లిగవ్వ యివ్వదు. రవి విషయంలో తాను అవలంబించిన నీతినీ, నియమాన్నీ రజనికోసం మాత్రం మార్చుకోవడానికి తను తయారుగా లేదు. అలాంటి పరిస్థితేవస్తే, రజని తన జీవితాన్ని తానే నిర్ణయించుకోవాల్సి వస్తుంది. రజనేం చిన్నపిల్లకాదు. యం. యస్. సి చేస్తోంది. తను కూడా సంపాదించుకో గలదు. తన సంపాదనతో తను కట్నం ఇచ్చుకుంటానంటే తన మనసు బాధ పడవచ్చు గానీ, ఆమెను మాత్రం వారించదు. ప్రేమ విషయంలో చివరి నిర్ణయాలు వారు తీసుకుంటేనే మంచిది. కానీ పెద్దగా, బాధ్యత తెలిసిన అక్కగా మంచీ చెడూ తెలిపే కర్తవ్యం మాత్రం తనమీద ఉంది.

(ఇంకా వుంది)



# — ధర్మపథం —

బులుసు వేంకటరమణయ్య

భగవద్భక్తులు దేవుని ప్రార్థిస్తూ ఉంటారు. కొందరు ఆ పరాత్పరుని గుణగణాలను వర్ణిస్తూ చెప్పబడిన స్తోత్రాలు పఠించి, ప్రార్థనలు చేసినట్లు తృప్తి పడతారు. కొందరు తమ కోరికలను విన్నవించుకుంటూ ప్రార్థన చేస్తారు. పాత కాలపు మనుష్యులు తెల్లవారు ఝామున కోడి కుయ్యక ముందే లేచి కూర్చుని ప్రార్థనా శ్లోకాలు, పద్యాలు తెల్లవారే వరకూ ఉచ్చరించి, ఆమీద ప్రాతః కాలంలో జరుప వలసిన కృత్యాలు ప్రారంభిస్తారు.

మనస్సు నిలకడగా ఉండడమే ప్రార్థనకు ప్రధాన ప్రయోజనం. ప్రశాంతి ఏర్పడితేనే గాని మనస్సు స్థిరంగా నిలవదు. ప్రశాంతత కలగడానికి కొంత విశ్రాంతి అవసరం. ఆ విశ్రాంతి ఉన్నప్పుడు ప్రార్థనకు అనుకూల్యం ఏర్పడుతుంది. దానికి అన్ని పనులు ముగించి రాత్రి నిద్రించే సమయమూ, ఉదయాన్నే లేచి ఆ దినం చెయ్యవలసిన పనులు ప్రారంభించడానికి ముందు సమయము తగి ఉంటాయి: ఆ సమయాలలో లోకం కొంత నిశ్శబ్దంగా ఉండి ప్రార్థనకు సహకరిస్తుంది.

ప్రార్థన కేవలం స్తుతి మాత్రమే కాదు. అందులో విన్నపం కూడా ఉన్నది. ఈ రెండూ కలిసి వున్నప్పుడే అది సరియైన ప్రార్థన అవుతుంది.

ప్రతి మానవుడూ రాత్రి పడుకో బోయేటప్పుడూ, ఉదయం లేవడానికి ముందు దైవప్రార్థన జరపాలి.

రాత్రి చేయవలసిన ప్రార్థన ఇలా ఉండాలి.

"దేవా! ఈనాటి నా శరీర యాత్ర ఇప్పటితో ముగిసింది. నేడు నేను చేసిన పనుల్లో— తెలిసి చేసిన పాపాలు కొన్ని, తెలియక చేసిన పాపాలు కొన్ని ఉంటాయి. వాటి నన్నింటిని క్షమించి నన్ను కాపాడ వలెనని ప్రార్థిస్తున్నాను.

మనస్సులో చెడ్డ తలపులు తలచి, పరుషంగానూ, అధర్మంగానూ మాటలాడి, కాయంవల్ల చాలా చెడ్డ పనులు చేసి నేడు గడించిన పాపాలను క్షమించాలి ప్రభూ! నేను, విన్నో విధాల ప్రయత్నిస్తూ ఉన్నా, నా మనస్సు నిలకడ చెందక పారిపోతూనే వుంటుంది. మంచినే తలచాలని అనుకొంటూనే అది చెడుగు వైపు పోతూ వుంటుంది. దీనిపోరు పడలేకుండా ఉన్నాను. ఆ మనస్సును బంధించి ఒక్కచోట ఉంచడానికి మార్గాన్ని చూపు"

ఉదయాన లేవడానికి ముందు— తెలివి రాగానే, పడకమీదనేవుండి చేతులు జోడించి దేవునికి మొక్కుతూ, మనస్సులో నే ధ్యానించి "ఓ దేవా! నా జీవనయాత్రా మార్గంలో ఒక మైలు ముందుకు పోదలచాను. ఈ దినం నేను ఏట్టి చెడ్డపనులూ చెయ్యకుండా, ఏట్టి పాపాలు సంపాదించకుండా ఉండేటందుకూ నా మనస్సు స్థిరంగా ఉండి ఆలోచించడానికి సహాయం చెయ్యి. ఇదే నా కోరిక" అంటూ లేచి నిత్య కృత్యాలు ప్రారంభించాలి.

( గత సంచిక తరువాయి )



















[ఇంకా ఉంది]




"మరి మేడం! ఈ ఉత్తరాలు కల్పనలే నంటారా ?"

"కాకపోవచ్చు! ప్రపంచ ధర్మం అది ఎవడన్నా ఒక మాట చెప్తే, కాదనేవారు పదిమంది వుంటారు అవుననేవారు పదిమంది వుంటారు. ఎటూ తేల్చుకోనివారు మరో యాభై మంది ఉంటారు. అలాగే గిరిజ ఎవరిమీదగూడా, రకరకాల ఉత్తరాలు వచ్చిఉండవచ్చు వాటిలో అవసరాన్నిబట్టి అనుకున్నవి వేస్తే గిరిజ, నవలారంగంలో హిమాలయాన్ని అందుకోవచ్చు, లేదా పాతాళంలో పడిపోవచ్చు"

ఇంతలో గుంటూరు స్టేషన్ రావడంతో అంతా దిగి వెళ్ళిపోయారు. గిరిజ, సంధ్యలు లేడీస్ వెయిటింగ్‌రూంలోకి వెళ్ళారు గిరిజ ముఖం కడుక్కుంది. ఇద్దరూ కాఫీ త్రాగారు. అయినా, స్టేషన్ వదిలి వెలుపలికి రాలేదు

"గిరిజా! విన్నావుగా, సరోజనిమాటలు ? నీ భ్రమలను పోగొట్టుకో! నీవు రచయిత్రివి కాకుంటే ఏం కొంపలు మునిగిపోవు!"

"లేదు సంధ్యా, లేదు రచయిత్రి అన్న

( గత సంచిక తరువాయి )

జాడ్యం నా మైండ్‌లో చాలాలోతుగా, గుచ్చుకుంది అదృష్టవశాత్తు పెన్నిధి దొరికిందనుకున్నాను నా ఆశతో, ఆశయాలతో భవిష్యత్తునూ, రచనా రంగానికే, అర్పణ చేసుకున్నాను నేను ఆ జానికమ్మను కలుసుకుంటాను. సాటి స్త్రీగదా? నన్నర్థం చేసుకోలేదా? రచయిత్రిగా నాకు భవిష్యత్తు లేకుంటే, నాకిక జీవితం...పరిసమాప్తి అయినట్లే లెక్క. ఏ పురుషుడుచేత కన్నెత్తి చూడబడని నేను, రచయిత్రి నయ్యాకే గిరిబాబు నన్ను ప్రేమించారు సంధ్యా' నాకది జీవన్మరణ సమస్య!"

సంధ్య ఆశ్చర్యంగా కండ్లుపెద్దవి చేసింది "గి...రి...జా!... ఎంతగా మారిపోయావే" అన్నది.

"సంధ్యా! లీవ్‌లెటర్ ఇస్తాను మీ ప్యూన్‌చేత పంపు – మా ఆఫీసుకు నేను తిరిగి బండికి వెళ్ళిపోతాను ఈ సంగతి తేలందే ఆఫీసుకువెళ్లను." అంటూ, తన బాగ్‌లోంచి ఒక తెల్లని కాగితాన్ని తీసి, లీవ్‌లెటర్ వ్రాసి ఇచ్చింది గిరిజ

**జరిగిన కథ – 19 :** సంధ్య, స్వరూపరాణి స్నేహితురాండ్రు సంధ్య గుంటూరులో టైపిస్టుగా పనిచేస్తోంది. ఆరోజు స్వరూపరాణి పెండ్లిచూపులు అవటంవలన రోజాకంటే ముందుగా విజయవాడకు వస్తున్న సంధ్య ట్రయిన్‌లో పెండ్లికొడుకు హరికృష్ణను చూసి, అతను స్వరూపరాణికి తగడను కొంటుంది అతన్ని తన ప్రక్కన ఊహించుకొని ఆనందిస్తుంది హరికృష్ణ విషయంలో ఎటూ తేల్చి చెప్పలేకపోతుంది స్వరూపరాణి సంధ్య హరికృష్ణ ఇంటికి వెళ్ళి అతని తల్లి భ్రమరాంబను, చెల్లి మల్లికనీ తన వాక్చాతుర్యంతో ఆకట్టుకొంటుంది గిరిజ తన జీవితంలో జరిగిన మరుపురాని సంఘటనను ఒక కథగా వ్రాసి చదవమని సంధ్యకిస్తుంది. ఆ కథను చదివిన సంధ్య బాధపడి, దాని ఆఖరు పేరాను కొంచెము మార్చి వారపత్రికకు పంపిస్తుంది. హరికృష్ణ, స్వరూపరాణిని పెండ్లి చేసుకోవటానికి ఇష్టపడడు. అతను సంధ్యకు పెండ్లి అయిందో లేదో తెలుసుకోవటానికి అనేక ప్రయత్నాలు చేస్తుంటాడు. హరికృష్ణను తనవాడిగా చేసుకోవటానికి కృషి చేస్తూంటుంది సంధ్యారాణి. ఆదర్శభావాలు గల యువకుడు గిరిబాబు. కట్నం లేకుండా ప్రేమించి పెండ్లి చేసుకోవాలని నిర్ణయించుకుంటాడు. అతనికి ప్రేమించే విధానంతోపాటు కొన్ని పథకాలను కూడా సూచిస్తుంది సంధ్యారాణి. పత్రికలో పడిన గిరిజ కథ చదివి నలుగురూ నానారకాలుగా అనుకుంటున్నారని విని, ఆమెతోపాటు బాధపడుతుంది సంధ్య. మధు మల్లికల మధ్య రహస్య ప్రేమాయణం సాగుతూంటుంది మధు కోరికమీద అతను నేర్చుకునే టైప్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరుతుంది మల్లిక గిరిబాబు, మల్లికలు ప్రేమించుకొనేట్లుజేస్తే, తను హరికృష్ణకు చేరువవ్వచ్చునుకొన్న సంధ్య ఆశలు నిరాశలౌతాయి. తన కథను గురించి అభిమానులు పంపిన ఉత్తరాల్లోని ఓ రెండు ఉత్తరాలను సంధ్యకు చూపిస్తుంది గిరిజ హరికృష్ణ కోరికమీద విజయవాడలోని కొన్ని ముఖ్యమైన ప్రదేశాలను చూపిస్తుంది సంధ్య తన కథ చదివి నేరుగా పెండ్లి చేసుకొంటానని వ్రాసిన గిరిబాబు ఉత్తరాన్ని సంధ్యకు చూపించి, ఆమె సలహా తీసుకుంటుంది గిరిజ. లోలోన ఒకరినొకరు పరస్పరము ప్రేమించుకొంటున్న హరికృష్ణ, సంధ్యలు మల్లిక పెండ్లి చేసి, తాను వివాహం చేసుకోవాలని అమరావతిలో నిర్ణయించుకుంటారు గిరిబాబు గిరిజల మధ్య ప్రేమ, లేఖలద్వారా సాగుతూంటుంది. హరికృష్ణ సంధ్యను, మల్లిక మధును పెళ్లి చేసుకోవటానికి భ్రమరాంబ ఆనందంగా ఒప్పుకొంటుంది.

సంధ్య ఏం చేయ్యడానికి తోచక, గిరిజ ఇచ్చిన ఉత్తరాన్ని అందుకుంది నిర్లిప్తంగా.

31

ఇల్లు చేరుకున్న గిరిజ, రెండు రోజులపాటు తర్జన భర్జనలు చేసుకుంటూ తన గదిలో గడుపుతున్నది ప్రతిరోజూ ఉదయమో, సాయంకాలమో సంధ్య వచ్చి, గిరిజకు ధైర్యం చెప్పిపోతున్నది.

అసలు సరోజిని చెప్పిన ఈ ముడుపుల సంగతి నిజమేనా? జిల్లా పరిషత్ ఆఫీసులో పనిచేసినా, ఏదో పెద్ద ఆఫీసర్లలో ఈ ముడుపుల తతంగం ఉన్నదని విన్నది. కానీ, ఈ రచనా రంగంలో ఉండి ఉంటుందా? ఎన్నో ఉత్తమమైన ఆశయాలతో, మూఢనమ్మకాలను పారిపెట్టి, ఆధునిక భావాలను ప్రచారం చెయ్యడానికి కంకణం కట్టుకున్న రచనారంగం కూడా కలుషితం అయ్యిందా?

అసలు ఈ ముడుపులు ఎలా ఇవ్వాలి? తీరా ఇవ్వబోతే, గెటవుట్ అంటే? – ఇలా మథనపడి, మథనపడి మూడోరోజు సాయంకాలం ఐదు గంటలకు, గిరిజ మహారచయిత్రి జానికమ్మ ఇంటికెళ్ళింది – చాలాచోట్ల వాకబు చేసి ఇల్లు కనుక్కుని. రచయిత్రి జానికమ్మ ఇల్లు సామాన్య మధ్యతరగతి కుటుంబీకుల ఇల్లులాగా ఉంది. పిల్లాపీచుతో కోలాహలంగా వుంది. అక్కడే ఓ యాభై ఏండ్ల వయిసామెను చూసి, ఆమెను సమీపించి సంధ్య అడిగింది – 'ఏమండీ! మహారచయిత్రి జానికమ్మగారున్నారా?" – అని.

"ఏమో? ఎక్కడ చచ్చారో నాకు తెలీదు!" అన్నదా స్త్రీ పెళుసుగా.

గిరిజ చిన్నబుచ్చుకుని, అక్కడనుండి వెళ్ళలేక వెళ్తుంటే, అక్కడే ఉన్న పనిమనిషి అన్నది గిరిజతో రహస్యంగా "...హోటల్‌లో ఉంటారు వెళ్ళండి!" అని

పనిమనిషి మాటలు విని, గిరిజ సంతోషంగా బయలుదేరింది హోటల్‌కు

అనేక రకాలుగా వాకబులు చేసుకుని, గిరిజ ఆ హోటల్‌లో ఒక గదిముందు నిలబడింది, బెరుకుగా. ఆ గది తలుపు త్రోసుకుని లోపలి కెళ్ళడానికి గిరిజకు ధైర్యం చాలలేదు. మహా రచయిత్రి జానికమ్మగారంటే గౌరవం, విపరీతమైన భయం, గిరిజ మనస్సును భయపెడుతున్నాయి.

ధైర్యం పుంజుకుని కాలింగ్ బెల్ నొక్కింది.

"కమిన్' అన్న ఎర్రని అక్షరాలు కాలింగ్ బెల్ క్రింద ఫ్లాష్ అయ్యాయి.

గిరిజ మెల్లగా తలుపును నెట్టుకొని, లోపలి కెళ్ళింది గిరిజ లోపలికెళ్ళగనే, తలుపు ధన్‌మని మూసుకుంది. గదిలోకి అడుగుపెట్టగనే గిరిజ కళ్ళు మంటలుపెట్టాయి

ఆ గది ఓ విశాలమైన డబుల్ బెడ్‌రూం. రెండు ఖరీదైన మంచాలున్నాయి. వాటిమీద ఖరీదైన తెల్లపరుపులూ, దిండ్లూ వున్నాయి ఒక్కో మంచంమీద ముగ్గురేసి రకరకాల వయసుల వారు కూర్చునివున్నారు ఆ రెండు మంచాల నడుమన ఉన్న మినీ టేబుల్‌మీద రంగురంగుల ద్రవాలతోటి పొడుగుపాటి సీసాలున్నాయి. షోడాలు

..జన్నకొద్దీ టేబిల్‌మీద, టేబిల్ క్రిందా ఉన్నాయి హోటల్ పార్సెళ్ల బాపతు పొట్లాలు తెరువబడి వున్నాయి మంచాలమీద కూర్చున్న ఆర్గురు పొడుగుపాటి సిగరెట్లను త్రాగుతూ, ఫ్యాక్టరీ గొట్టాల్లాగా పొగను వదుల్తూ, రకరకాల నంగి మాటలతో గలీజుగా మాట్లాడుకుంటున్నారు వాళ్లు గిరిజ రాకను గమనించలేదు.

గిరిజ పొరబాటున ఇంకేదో రూంలో కాలు పెట్టాననుకుని, భయంతో వణికి, వెళ్లిపోదామని వెనుదిరిగింది. అయితే వాళ్లకు దూరంగా ఒక సోఫాలో కూర్చుని, లాల్చీ పైజామా వేసుకున్న ఆజానుబాహుడైన అందగాడు, సోఫాలోనుండి ఠీవాలున లేచి, గిరిజ దగ్గరకు వచ్చి "ఎవరు కావాలండీ?" అని అడిగాడు.

గిరిజ, తడబడుతూ "క్షమించండి' పొరబాటైంది. నేను, మహారచయిత్రి జానికమ్మను కలుసుకోవాలని వచ్చాను. హోటల్ వాళ్లు ఈ రూంనంబర్ చెప్పి వెళ్లమన్నారు. సారీ! మిమ్మల్లను డిస్టర్బ్ చేసాను."

"పర్లేదు! ఇంతకీ మీరెవరు?" అన్నాడా ఎడివయస్కుడు.

"నాపేరు కుమారి గిరిజా కుమారి!..."

"అంటే...మీరు... ఆశావాదం .."

"అవునండీ! ఆ సీరియల్ నాదే ..."

"రండి! రండి! సరైన చోటుకే వచ్చారు. ఆ మహా రచయిత్రి ఇక్కడేఉంది రండి!" అంటూ గదిలోకి దోవ తీశాడు లాల్చీవాలా!

గిరిజ నిలకంటుకుపోయి,వింతగా లాల్చీవాలాను చూస్తూ ఉన్నది.

"రండి మీకేం భయంలేదు. రండి!" అంటూ లాల్చీవాలా తను ఇంతవరకూ కూర్చుని ఉన్నసోఫా ప్రక్కన ఒకకుర్చీ వేసి, రండి అన్నాడు.

గిరిజ మంత్రముగ్ధలా వెళ్లి, లాల్చీవాలా ప్రక్కన ఉన్న కుర్చీలో కూర్చుని భయంగా డబుల్ బెడ్‌మీద, గలభాగా మాట్లాడుకుంటున్నవాళ్లను చూసింది. వాళ్లు వీళ్లను పట్టించుకోకుండా, పెద్ద సీసాలలోని ద్రవాలను గ్లాసుల్లో పోసుకుని, చిన్న సీసాలలోని ఉపద్రవాలను కలిపి ఆనందంగా త్రాగుతున్నారు.

లాల్చీవాలా గిరిజతో చెబుతున్నాడు— "అరుగో! అవతలి మంచంమీద ముగ్గురు అరవై ఏళ్ల ముసిలాళ్లున్నారు చూశావా? అందులో మొదటివాడు మహా రచయిత్రి! జానికమ్మ! రెండో ముసిలాడు గాడిద గుడ్డు కవితాదేవి! మూడోవాడు — తోకరాదేవి. ఇవతలి మంచంమీద కూర్చున్నవాడు, మొదటివాడు గోంగూర కరివేపాకమ్మ. రెండోవాడు— రంభ — విధిన్‌క్వొటేషన్స్— మూడోవాడు హిడింబి. ఇంకా తాటకి, త్రిజట, లంఖిణి, గొడ్డసావిటి వెంకట్సుర్సమ్మ, మండోదరి, శూర్పణఖి — ఇంకోగంటలోగ, ఇక్కడున్న మహారచయిత్రులను సేవించుకోడానికి, పెద్ద పెద్ద సీసాలతో వస్తారు."

గిరిజకు మిడిగ్రుడ్లు పడ్డాయి. అయినా నోరు యాంత్రికంగా అన్నది, "వాళ్లుగూడా... మగాళ్లేనా?"

"అది చాలా చిక్కుప్రశ్న! వీళ్లూ వాళ్లు అంతా మగాడరచయిత్రులు! లేక, కొజ్జా రచయిత్రులు! కానీ స్త్రీలు మట్టుకు, కాదు!"

గబగిబ అయిదారుగురు ప్రముఖ రచయిత్రుల పేర్లు అని — "వీళ్లు గూడా మగాళ్లేనా?" అన్నది గిరిజ అనుమానంగా

"కాదు! కాదు! వాళ్లు స్త్రీలే! కానీ, వాళ్లంతా వీళ్లు చెప్పిందానికి తంధాన అంటే, తానె తంధాన అనేవాళ్లు లేకుంటే, ఎవరికీ బాధ కలుగని ఊహాలోకపు రచయిత్రులు."

"ఇంతకీ మీరు?"

లాల్చీవాలా తన పేరును చెప్పాడు.

"ఓ! మీరా అండి! నమస్కారం సార్! మీకీ సంగతులు ఎప్పట్నుంచీ తెలుసును సార్?"

"ఆంధ్రసాహిత్యంలో మహిళాయుగం ప్రారంభం అయినప్పటినుండి! యావద్భారత దేశంలోనే, సర్వప్రపంచంలోనే అపురూపంగా మన ఆంధ్రదేశంలో పుట్టిన మహిళా రచనా ఉద్యమాన్ని మంచంలో చేరిన నల్లులవలె నాశనం చేయాలని, ఇలాంటి కొజ్జా రచయితల — వేషాలు, భాషలూ, భావాలూ, తత్వాలూ మార్చుకున్నప్పటి నుండీ!"

"నాకు జానికమ్మగారిని పరిచయం చెయ్యండి!" అడిగింది గిరిజ సగం చచ్చి.

లాల్చీవాలా కుర్చీలోనుండి లేవబోతుంటే, హఠాత్తుగా తలుపు తెరుచుకొని, ఒక యువకుడు ప్రవేశించాడు. చేతిలో పొడవాటి బ్రాందీసీసాతో. ప్రవేశించగనే, గిరిజ మీద కండ్లు పడ్డాయి. కండ్లతోనే ప్రశ్నించాడు లాల్చీవాలాను. లాల్చీవాలా కన్నెర్ర చేయడం చూసి తక్కున చూపులు త్రిప్పుకుని జానికమ్మ దగ్గర నిలబడ్డాడు.

"గురూ!"



జానికమ్మ తలెత్తి ఆగంతకుడి వంక చూడలేదు.

"గురూ!" కొద్దిగా గట్టిగా పిల్చాడు ఆగంతకుడు.

"ఎవర్రా!" అని జానికమ్మ తల ఎత్తి, ఆ గంతుకుని చూసి "రా! రా! త్రిజటా!" అన్నాడు.

"గురూ! మద్యపాన నిషేధం గురించి రికార్డింగ్ చేయించివచ్చాను. ఆ డబ్బుతో రెండు బ్రాందీ బాటిల్సు కొంటే, అందులో ఒకదాన్ని ఆ గూండాశాస్త్రి తన్నుకెళ్లాడు గురూ!"

"పోనీరా! వాళ్లమటుకు... ఎవరు? మన బదర్సేగదా?!"

"గురూ!"

"ఆఁ!"

"దిగంబర రచయితలొచ్చారు గుర్తూ! రమ్మంటావా?"

"రమ్మను!" అన్న జానికమ్మ మాట విని, త్రిజట సీసాను టేబిల్‌మీదపెట్టి వాకిట్లోకెళ్లాడు.

జానికమ్మ మొదటిసారిగా గిరిజను చూశాడు. ఒక్క క్షణం అతని చూపులు గిరిజపైన అతుక్కునిపోయాయి ఆ తర్వాత లాల్చీవాలా వంక చూసి, మళ్లీ గ్లాసు నింపడంలో నిమగ్నుడయ్యాడు.

దిగంబర రచయితల పేరు వినగానే, గిరిజ ఉలిక్కిపడి, భయపడి, లాల్చీవాలావంక చూసింది.

"ఏమండీ! ఏమండీ! ఇక్కడ ఆడవాళ్లున్నారని, ఆ దిగంబరులను... రావద్దని చెప్పండి!"

లాల్చీవాలా ముసిముసిగా నవ్వి, "దిగంబర రచయితలు గుడ్డలు విప్పకుని తిరుగరు!"

'మరాపేరేంటండీ!"

"వారి రచనలు దిగంబరంగా, నగ్నంగా ఉంటాయని వారంటారు!"

"అంటే, ఏంటండీ!"

"ఉదాహరణకు ఎద్దంత మనిషి గుడ్డలివ్పకుని నీ ఎదురుగా నిల్చుంటే ఎలాగుంటుంది."

గిరిజ వాంతి చేసుకోబోయి ఆపుకుని కండ్లు రెండూ మూసుకుంది.

"అలాగే ఉంటాయి, వారి రచనలు!"

ఇంతలో ఇద్దరు భీకరాకారులు గదిలోకొచ్చారు.

"నమస్కారం, జానికమ్మగారూ!"

"నమస్తే! ఎవరు మీరు!"

"నా పేరు చంద్రవివ్ప చెంఘిజ్‌ఖాన్! వీడి పేరు మాంసభక్షకభైరవ!"

"ఎందుకొచ్చారు?"

"మా రచనలకు మీరు చోటు కల్పించాలి!"

"నన్ను ఆత్మహత్య చేసుకోమంటారా?"

"అంత అవుసరంలేదు. ఇప్పుడు మేం కొద్దిగ... స్పీడ్ తగ్గించాము!"

"లాభంలేదు! మీకెప్పుడో చెప్పాను. నా మాటలు వినక చెట్లూ, పుట్టలూ పాలయ్యారు! మీ కమ్యూనిస్టు పత్రికలున్నాయిగా! అందులో చూసుకోండి!"

"లాభంలేదండీ! వాటి సర్క్యులేషన్ తక్కువ!"

"నన్నేం చావమంటారయ్యా! అప్పటికి ఒక్కో డోసు మార్క్సిజాన్ని సటిల్‌గా నైస్‌గా తగిలిస్తున్నాను. అయినా పాఠకులు తెలివిమీరిపోయారు! ఒక్కో డోసు తగిలిస్తుంటే ఒక్కో వెయ్యి సర్క్యులేషన్ పడిపోతూంది. మా ప్రొప్రైటర్స్ సంగతి తెలుసుగదా? సాహిత్యం ఏ గంగలో కలిసినా వాళ్లకు పట్టదు. సర్క్యులేషన్ ఒక లెవల్ దాటి, కిందబడితే వాళ్లు నా గొంతు పిసుకుతారు!"

"క్షమించండి! మూడ్‌లో లేనట్లున్నారు! రేపు ఉదయం కలుస్తాము!" అంటూ భీకరాకారులిద్దరూ వెళ్లిపోయారు.

జానికమ్మ లాల్చీవాలా వంక చూశాడు.

లాల్చీవాలా లేచి, జానికమ్మ దగ్గరికెళ్లి, "గిరిజాకుమారి! ఆశావాదం. రచయిత్రి" అని వినయంగా పరిచయం చేశాడు.

గిరిజ కుర్చీలోంచి జానికమ్మ దగ్గరికెళ్లి వినయంగా నమస్కరించింది. జానికమ్మ, గిరిజను పరిశీలించి,

"పద్నేడు! తెలివితేటలున్నట్లున్నాయి! లమ్మా చెక్ అందిందా?" అన్నాడు.

"అందిందండీ!" అంటూ భయంగా, రెండువందల రూపాయల కాగితాల్ని జానికమ్మకు ఎదురుగా పెట్టింది గిరిజ.

జానికమ్మ ఆ కాగితాన్ని తీసుకొని లెక్కించి, "చెక్ రెండొందలకే పంపారా?" అన్నాడు.

"లేదండీ! ఆరొందలు పంపారు!"

జానికమ్మ విసురుగా వందరూపాయల కాగితాల్ని నేలకేసికొట్టి, 'మహారచయిత్రులయ్యేది! రేపు వేలకు వేలు పబ్లిషర్ల దగ్గర గుంజేదీ! ఇంతపబ్లిసిటీ ఇస్తుంటే, ఇంత ఇన్‌సల్టా?!" అని గర్జించాడు.

"క్షమించండి! పార్టీలు... పగ్గైరా... ఉబ్బు..ఖర్చు... అయిపోయింది ... తర్వాత."

"ప్లీజ్ గెటవుట్! రేయ్. తాటకీ... ఆశావాదం సీరియల్‌ని ఎత్తిపారేయ్ రేపటి ఇష్యూనుండి! 'దొంగబాబాలూ— మోసాలూ!' అన్నవ్యాసందంచు ఆశావాదం అనివార్యకారణాల వల్ల ఆగిపోయిందని, ఆ సీరియల్ మీద వచ్చిన అరడజన్ బాడ్‌లెటర్సును కుమ్ము"

"చిత్తంగురూ" అన్నాడా తాటకి.

"లాల్చీవాలా, రెండొందల రూపాయల కాగితాల్ని ఏరి, చేతబట్టుకుని పదమ్మా!" అన్నాడు.

గిరిజ కన్నీళ్లతో ఆశగా, జానికమ్మ వంక చూస్తున్నది

ఇంతలో తాటకి అన్నాడు, "గురూ! రచయిత్రిని ఈ పూట ఇక్కడ ఉండమన కూడదూ? సాహిత్య చర్చ చేయవచ్చు!'

"ఛ! ఏం పూర్ టేస్టురా నీది?" అన్నాడు హిడింబి

రచయిత్రులంతా ఘొల్లున నవ్వారు.

తాటకి అన్నమాటలతో పడగవిప్పిన త్రాచులా బుస్సుమన్న గిరిజ అభిమానం, హిడింబి మాటలతో పడగచితికి నేలను కరుచుకుంది

"పదమ్మా!" అని లాల్చీవాలా గిరిజను గది దాటించి, రెండొందల రూపాయలు చేతిలోపెట్టి తను గదిలోకి వెళ్లిపోయాడు.

గిరిజ కండ్లు తుడుచుకుని, హోటల్‌దాటి రిక్షాలో ఇల్లుచేరి, తనగదిలోకి వెళ్లి తలుపు వేసుకుని భోరున ఏడ్చింది పదినిముషాలపాటు. అలా గిరిజ ఏడుస్తుంటే తలుపు తట్టినట్లు చప్పుడు వినిపించింది.

"నీ కోసం ఎవరో వచ్చారమ్మా" అన్నది గిరిజ తల్లి.

గిరిజలో ఆవేశం అల్లల్లాడింది, "హోటల్ నుండి కబురా?" అని.

గిరిజ తలుపు తీసింది. ఎదురుగా గిరిబాబు నిలబడి ఉన్నాడు!

గిరిజ, గిరిబాబులు కొద్దిక్షణాలు ఒకర్నొకరు చూసుకున్నారు— ఆశ్చర్యంగా క్రమంగా గిరిబాబు ముఖంలో ఆశ్చర్యం, జుగుప్స, అసహ్యం రంగుల రంగుల దీపాలుగా తిరిగాయి

గిరిబాబు గిరుక్కున వెనుదిరిగి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్లిపోయాడు గిరిజ పంచ ప్రాణాలలోని నాలుగు ప్రాణాలు గిరిబాబుతో వెళ్లిపోయాయి.

మిగిలిన ఒక్కప్రాణంతో గిరిజ నీరసంగా గదిలోకి వెళ్లింది.

సంధ్యపేరిట గిరిజ పెద్దలేఖలు రెండువ్రాసి కవర్‌లోపెట్టి అంటించింది. బజారుకెళ్లి, మాత్రలు తెచ్చుకుంది.

కడుపునిండా అన్నం తిన్నది.

## ఓ కవితా విహంగమా!

**ఓ కవితా విహంగమా!**
ఈ విశ్వ చైతన్య దీపికలో
ఈ నిరంతర భావనాకాశంలో
ఆగోచర చిహ్నంలా
విశ్వంభర తేజంలా
ప్రజ్వలించే
నీవెక్కడ?
ఆకాశపుటంచుల్లో
అనూహ్య శిఖరాలపై
గీతుల నధిగమించి
తారలలో తారవైనావ్
అంతలో
పాలపుంతలో
విస్ఫులింగంలా
మిణుగురులా
మెరుస్తూ; కనుమరుగైనావ్
తరతరాలకి
నీ అంతరాన్నే
నా అంతర్యంలో
నిగూఢమొనరిస్తా!

— దిట్టకవి శ్రీనివాసాచార్యులు

తల్లితో, తండ్రితో, చెల్లితో సౌమ్యంగా మాట్లాడింది.

రాత్రి పదిన్నర గంటలకు మాత్రలన్నీ మింగి, మంచినీళ్లుతాగి, కవర్‌ను గుండెలమీదపెట్టుకుని, 'గిరిబాబూ! క్షమించు! నీకు ద్రోహం చేశాను! నన్ను క్షమించు! ప్రభూ! తీసుకెళ్లు!" అనుకుని ప్రశాంతంగా, దీర్ఘనిద్రలోకి జారుకుంది గిరిజ.

## 32

గిరిజ ఇంకో గంటన్నరకు విజయవాడలో నిద్రమాత్రలు మింగుతుందనగా, గుంటూరులో, హరికృష్ణ ఇంట్లో కోలాహలంగా ఉంది. ఆ మరునాడే మధుబాబు సంధ్యవాళ్లింటికి వస్తాడు భోజనాలు అక్కడే సంధ్య ఇంట్లో వాళ్ల వాళ్ల పెండ్లిండ్లకు వాళ్ల పెద్దలు అభ్యంతరాలు పెడతారని అంతా అనుకున్నారు. ఎవరు అభ్యంతరాలుపెట్టినా, ఆమోదించినా రేపు సమావేశం అయి, నలుగురూ నిర్ణయించుకుంటారు, పెండ్లి ముహూర్తం సంగతి. ఆ తరువాత సంధ్య తమ పెద్దవాళ్లకు సంగతెసి తెలుపుతుంది సంధ్య తరఫు పెద్దలు, పెద్ద ఆటంకాలను పెట్టరని అంతా అనుకున్నారు కానీ, మధుబాబు విన్నాయని అవరోధాలు కల్పించవచ్చని, మధుబాబు అన్నాడు

ఆ రోజునే మల్లిక, మధుబాబు, సంధ్యల బ్యాంక్ టెస్టులు అయిపోయాయి భ్రమరాంబ ఆనంద డోలికలతో ఊగిపోతున్నది. సమయం రాత్రి తొమ్మిది గంటలైంది భ్రమరాంబ మల్లిక, హరికృష్ణలను భోజనాలకు లెమ్మంది

ఇంతలో హరికృష్ణ మేనమామ కేశవయ్య, ఇంట్లోకొచ్చాడు కేశవయ్యకు దాదాపు యాభై సంవత్సరాల వయస్సుండవచ్చు. ముతక పంచ, మోకాళ్లమునిగి పోయేంతటి చొక్కాను ధరించాడు చేతిలో పాత గొడుగు, గుడ్డసంచీ ఉన్నాయి

"రా మామయ్యా! రా!"— అంటూ అయిష్టంగానే ఆహ్వానించాడు హరికృష్ణ

కేశవయ్య నేరుగా వెళ్లి, కుర్చీలో కూర్చుని, అక్కడికి దగ్గరలో ఉన్న మల్లికతో మందహాసంగా, "ఏం కోడలా? ఎలా ఉన్నావు' అన్నాడు

మల్లిక పలుకలేదు

"ఎవరూ వచ్చింది?" అంటూ భ్రమరాంబ ముందు గదిలోకి వచ్చి, కేశవయ్యను తేరిపార చూసి గుండుదెబ్బతిన్న లేడిలా, వణికిపోతూ "ఏంరా? ఎందుకొచ్చావు?" అన్నది

"బంధువులన్నాక రాకపోకలు లేకుండా ఎట్లా ఉంటాయే, భమరా?" అన్నాడు విషపూరితంగా నవ్వుతూ, కేశవయ్య

"ఇక నీ బంధుత్వంతో మాకు పన్లేదు. మాకు మిగిలిన ఆ ఎకరంపొలం నీవు తీసుకుని ఇక మాజోలికి రాకు, అని ఎన్నిసార్లు చెప్పానురా?!"

"నేను నీవల్లపడ్డ కష్టాలకు, అవమానాలకు, ఎకరం పొలం చాలదే!"

"చాలినా, చాలకున్నా అంతే ఇంకేమీ మానించి ఆశించకు."

"ఆఁహాఁ! అంతసులభంగా నన్నువదిలించుకో లేవు! ఆఁ! అన్నట్లు -- మల్లికకు ఎదురింట బ్బాయితో సంబంధం కుదిరిందటగా?!"

భ్రమరాంబ రివ్వునవచ్చి, కేశవయ్య పాదాలు పట్టుకుని కన్నీటితో అభిషేకిస్తూ, "ఒరే! ఇక మమ్మల్నిలా బ్రతకనివ్వరా? మమ్మల్ని అన్యాయం చెయ్యకురా!" అని ఏడుస్తున్నది.

"ఊఁ! హరికృష్ణగూడా, విజయవాడలోని కుటుంబరావు కూతుర్ని చేసుకోబోతున్నాడటగా"

"ఒరే! నీకు దయలేదా?"

"ఇంతకుముందే ఎదురింటి వాళ్లకు నీ చరిత్ర చెప్పొచ్చాను ఇక చూస్తే వాళ్ళు మల్లికను చేసుకోరు!"

మల్లిక, హరికృష్ణలు కేశవయ్య వంక దిగ్భ్రాంతులై, చూస్తున్నారు భ్రమరాంబ కేశవయ్య కాళ్లుపట్టుకుని, బ్రతిమాలుతూ, రోదిస్తున్నది.

''ఈ రాత్రే విజయవాడ వెళ్లి వాళ్లకు, చెప్పేంటించి వస్తాను''

భ్రమరాంబ ఇంకా రోదిస్తున్నది కేశవయ్య కాళ్లు వదలలేదు

''ఒరే హరీ!''

''ఏంటి మామయ్యా!''

''ఇంతమందికి తెలిసిన సంగతులు నీకు తెలుసుకోవాలని ఉందిరా ?!''

''చెప్పు మామయ్యా!''

భ్రమరాంబ ఈనిన బెబ్బులిలా, కేశవయ్యమీద విరుచుకునిపడి, కేశవయ్య నోటిని మూయడానికి ప్రయత్నిస్తుంటే, కేశవయ్య సులభంగానే భ్రమరాంబ చేతిని మెటిబెట్టి ఒక ప్రక్కకు నెట్టాడు. హరికృష్ణ, కేశవయ్యమీదికి దూసుకుని రాబోతుంటే, కేశవయ్య ''ఆగు!'' అని గర్జించాడు.

''ఏరా హరీ! మీ నాయన పేరేంటి ?''

''వెంకట్రావుగారు!''

''వెంకట్రావుగారు నీ తండ్రి కాదు నీ తండ్రి మల్లిఖార్జునుడు. నీవు మల్లిఖార్జునిడికి పుట్టావు!''

మల్లిక, హరికృష్ణ దిగ్భ్రాంతులై, స్థాణువులైపోయారు భ్రమరాంబ కుప్పకూలిపోయి చేతులతో ముఖాన్ని కప్పుకుని కుళ్లి కుళ్లి ఏడుస్తున్నది.

''అవున్రా! నీ తల్లిని మొదట్లో మల్లిఖార్జునిడికిచ్చి పెళ్లి చేసాం. నీవు పుట్టిన మూణ్ణెల్లకు, మీ నాయన చనిపోయాడు. వెధవముండ అయిన నీ తల్లినీ, నిన్ను ఆదుకున్నాను. ఏడాదిపాటు నా దగ్గరే వుంది. కొన్నాళ్లకు ఎవడో వెంకట్రావు అని, తాలుకు ఆఫీసు గుమస్తాతో నీ తల్లి నిన్ను తీసుకుని లేచిపోయింది. జీవితాంతం వెధవముండలాగా బ్రతకవలసిన మీ అమ్మ మళ్లీ పసుపు కుంకుమలు సిగ్గులేకుండా పెట్టుకుంది. ఆ తరవాత మల్లికను కన్నది. ఆ వెంకట్రావూ వచ్చాక, మళ్లీ దీన్ని కడుపులో పెట్టుకున్నాను.

# స్వయంవరం

నీవు ప్రయోజకుడివయ్యాక, నన్ను గంగలో ముంచింది!'' అంటూ కేశవయ్య లేచి ''ఈ సంగతి విజయవాడలో గూడా చెప్తాస్తాను. ఇంక మిమ్మల్ని ఎవరూ పెండ్లిండ్లు చేసుకోరు! ఆఖరుకు నా కాళ్లమీద పడాల్సిందే!'' అంటూ కేశవయ్య వెళ్లిపోతున్నాడు.

భ్రమరాంబ రౌద్రంగా లేచి ''హరీ! వాడ్ని గొంతుపిసికి చంపు! నీకేం భయంలేదు! నేనే చంపానని పోలీసులకు చెప్పి, జైల్లో కూర్చుంటాను. వాడ్ని చంపు!'' అన్నది, హరికృష్ణతో ఆజ్ఞాపిస్తున్నట్లుగా

కానీ, హరికృష్ణ షాక్‌లో మునిగిపోయాడు- తన తండ్రి వెంకట్రామయ్య కాదా? మల్లిఖార్జునుడా ?! – అని.

''అయిపోయింది! అంతా అయిపోయింది! విషసర్పం కాటు వెయ్యనేవేసింది!'' అనుకుంటూ, జుట్టు పీక్కుంటూ, ఏడుస్తూ, భ్రమరాంబ వంటింట్లోకి వెళ్లిపోయింది. మల్లిక విషాద వదనంతో నడింగదిలోకి వెళ్లి, కుళ్లి కుళ్లి ఏడుస్తున్నది.

హరికృష్ణ కణతలు నొక్కుకుంటూ కుర్చీలో కూర్చున్నాడు.

ఆనాడు రాత్రి ఎవ్వరూ అన్నం తినలేదు. ఎవరెవరి ఆలోచనా దుఃఖ ప్రపంచాల్లో వారుంటే, రాత్రి భారంగా జరిగిపోతున్నది.

## 33

ఆనాడే ఆఖరి బ్యాంక్ పరీక్షలు వ్రాసింది సంధ్య. పరీక్ష హాలు దాటి, క్వశ్చెన్ పేపర్ చేతబుచ్చుకుని హాలు వెలుపల ఉంటే, మల్లిక, మధుబాబులు క్వశ్చెన్‌పేపర్స్ చేతబుచ్చుకుని సంధ్యను కలిశారు. ప్రశ్నలకు ఎవరెవరు ఎలా సమాధానాలు వ్రాశారో పోల్చుకున్నారు.

ఆ ముగ్గురిలోనూ అద్భుతంగా జవాబులు వ్రాసింది, తనే అని గ్రహించింది సంధ్య అందరికంటే, మల్లిక బెస్ట్‌గా వ్రాసిందన్న సంగతిని గ్రహించి, సంధ్యకు చాలా సంతోషం అయింది

ఆ తరువాత హరికృష్ణ కనుపించి, ఆ మరునాడు ఉదయం హరికృష్ణ ఇంట్లో అంతా సమావేశం అయి, పెండ్లిండ్లను గురించి డిస్కస్ చేయాలనుకున్నారు

సంధ్య మనస్సు ఆనందడోలికలలో ఊగిపోతున్నది పెద్దల అశ్రద్ధవల్ల తనకు పెండ్లి కాదు అని, అనుకున్నది అదృష్టవశాత్తూ ఒక అందగాడిపైన తన మనస్సు నిల్చింది. తన స్వప్రయత్నంవలన, అదృష్టంవలన, ఆ అందగాడి మనస్సులో చేరుకోగలిగింది. హరికృష్ణ తల్లితో, చెల్లితో మంచి స్నేహం కలిసింది హరికృష్ణ చెల్లి పెండ్లి విషయంలో తను చాలా భయపడింది ఆ బాధ్యతను తనూ హరికృష్ణతో పంచుకుని, ఎన్నేళ్లైనా మల్లిక పెండ్లి చేసిగాని తను పెండ్లి చేసుకోగూడదనుకుంది ఆ సమస్య గూడా తేలికగానే పరిష్కరింపబడింది. అయినా, ఏదో కొరవగా వున్నది. మల్లిక, గిరిబాబును ప్రేమించి ఉన్నట్లైతే, తనకు సంపూర్ణంగ సంతోషం కలిగివుండేది కాని మల్లిక, మధుబాబును ప్రేమించింది. మధుబాబును తల్చుకుంటుంటే, సంధ్యకు ఏదో తెలీని భయం పట్టుకుంటున్నది. మధుబాబు, మల్లికను ప్రేమించినా, హరికృష్ణవలె తీవ్రమైన వ్యక్తి కాదు. తన ప్రేమకంటే ఉద్యోగానికి ప్రాధాన్యతనిస్తాడు. ఉద్యోగం వచ్చాక పెండ్లి చేసుకుంటాననంటాడు మధు గూడా బాగానే పరీక్షలు రాశాడు. కానీ, ఉద్యోగం రాకుంటే? ఉద్యోగం వచ్చాక మల్లికనే పెండ్లి చేసుకుంటానంటాడు! అది కొద్దిగా రిస్క్‌గా కనుపిస్తున్నది.

ఏది ఏమైనా, అంతా ప్రశాంతంగా జరిగిపోతున్నది. పెద్ద అడ్డంకులేం లేవు. హరికృష్ణ విషయం తన తల్లిదండ్రులకు చెబితే సంతోషిస్తారు కట్నం డబ్బులు ఇవ్వకుండా, కూతురి పెండ్లి అయిపోతున్నదంటే ఎవరుమట్టుకు సంతోషించరు ?

ఇలా సంధ్య ఆలోచించుకుంటూ, మెల్లిగా నిద్రలోకి జారుకుంది.

వేకువఝామున నాలుగు గంటలకు తమ ఇంటిముందు ఆటోరిక్షా ఆగడం సంధ్యకు లీలగా స్ఫురించింది. ఎవరు వచ్చి ఉంటారా? అన్న జిజ్ఞాసతో సంధ్య ఉండగా, ''అమ్మా! శకుంతలమ్మా! బాబూ! కుటుంబరావుగారూ!'' అన్న కేకలు వినబడ్డాయి.

''ఎవరూ ?'' అంటూ, శకుంతలమ్మ తలుపు తీసింది.

''నేనేనమ్మా! సాంబశివరావుని!'' అన్న గిరిజ తండ్రి మాటలను విని, సంధ్య ఉలిక్కిపడి లేచి మంచంమీద కూర్చుంది – మనస్సు కీడును శంకించగా.

''అమ్మా! శకుంతలమ్మా! సంధ్య ఏది ?''

''ఏమైందండీ ?''

''గిరిజ, మా కొంప ముంచింది తల్లీ! విషం మింగింది. చావుబతుకుల నడుమ కొట్టుకులాడు





తమ పిల్లల పౌష్టిక ఆహారం
గురించి తల్లులు బాధపడుతుంటారు.

అయితే సుచిత్రకు ఆ చింత లేదు...

"ఎందుకంటే, నేను మాపిల్లలకు రోజూ హార్లిక్స్
ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటినుంచి,
ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా పిల్లలకు
అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని
ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని
నాకు తెలుసు.

**మీ పిల్లలకు మీరు కూడా**
**హార్లిక్స్ ఇస్తారు. అవును కదూ?"**






"హార్లిక్స్ ప్రధాన పుష్టిదాయక పానీయం.
పుష్టిదాయకమైన ఆహార పదార్థాలతో అద్భుతంగా
దాన్ని రూపొందించారు. హార్లిక్స్ ఏళ్ళ తరబడి
నిరంతరంగా సత్ఫలితాలను చూపిస్తోంది. మా కుటుంబ
సభ్యుల ఆరోగ్యం కాపాడేందుకూ, వారు
ఏరోజుకారోజు చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను
మీకు సిఫార్సు చేస్తున్నాను."



**హార్లిక్స్**
**మంచి పుష్టికరమైనది.**

Hx-6082 Tel

యున్నది కాస్త సంధ్యను పిలు అమ్మా!'' అన్నాడు సాంబశివరావు ఏడుస్తూ

ఆ మాటలు విన్న సంధ్య చివాలున మంచం మీదనుండి లేచి, సాంబశివరావు దగ్గరకెళ్ళి ''ఏమైంది? బాబాయిగారు? గిరిజ ఎలా ఉంది?''

''అమ్మా! సంధ్యా! ఇంతకుముందే మీ పిన్ని ఎందుకో గిరిజ గదిలోకి వెళ్తే, గిరిజ తన గుండెల మీద ఈ ఉత్తరం పెట్టుకొని పడుకునివుంది ఏంటా ఉత్తరం? అని మీ పిన్ని చూస్తే, ఈ జాబు నీ పేరిట వుంది గిరిజ ముఖంలో దానికి ఏదో అనుమానం కనిపించి, ఎంత తట్టి లేపినా లేవలేదు దానికి భయంపుట్టి నన్ను లేపింది లేచి చూదునుగదా? నిద్రమాత్రల సీసా, గిరిజ టేబిల్‌పై వుంది వెంటనే గిరిజను క్లినిక్‌కు చేర్చాము డాక్టర్లు దానిచేత విషం కక్కిస్తున్నారు అది బాగా మత్తులోబడిపోయిందట! మత్తు వదిలేత్తేకాని బతికి బయటపడదు అని, అంటున్నాడు డాక్టరు మేం ఎంత పిల్చినా, అది పలుకడంలేదు రా తల్లీ! నీవు దానికి ప్రాణస్నేహితురాలివి! దాన్ని మత్తులోనుండి బయటపడెయ్! నీ కంఠం వింటే, స్పృహ వస్తుందేమో వంటాడు డాక్టర్! రా అమ్మా!' అంటూ, సాంబశివరావు ఏడుస్తూ ఒక కవర్‌ను సంధ్య చేతిలో పెట్టాడు

కవర్‌మీద 'నా ప్రాణస్నేహితురాలు సంధ్యా రాణికి' అని వుంది

సంధ్య తన గదిలోకి వెళ్లి, కవర్‌ను బాగ్‌లో పెట్టుకుని, బాగ్ భుజాన తగిలించుకుని గదిదాటి వెలుపలికి వచ్చి ''పదండి! బాబాయిగారూ!''



'అల్లుడు పట్టిన భరతం'లో ఒక దృశ్యం

అన్నది సాంబశివరావు, సంధ్యను వెంటబెట్టుకొని వాకిట్లోకివచ్చి, అక్కడే ఉన్న ఆటోలో ఎక్కాడు సంధ్య వెళ్లి సాంబశివరావు ప్రక్కన కూర్చుంది ఆటోవెళ్లి, క్లినిక్‌ముందు ఆగింది

సంధ్య, సాంబశివరావులు, ఆటోలోనుండి దిగి క్లినిక్‌లోకి వచ్చారు క్లినిక్‌లోని గదిలోకి సాంబశివరావు, సంధ్య ప్రవేశించారు గదిమధ్యలో, బెడ్‌మీద గిరిజ పడుకుని ఉంది గిరిజ ముఖం, వల్లగా పాలిపోయివుంది నుదట సన్నని స్వేద బిందువులు ఉన్నాయి మెడవరకు దుప్పటి కప్పబడి ఉంది బెడ్ ప్రక్కన స్టాండుకు సెలైన్ బాటిల్ వ్రేలాడుతూ, దానిట్యూబ్ బాటిల్‌నుండి దిగి దుప్పట్లోకి వెళ్ళిపోయి ఉంది గిరిజ ముక్కు రంధ్రంలోకి ఒక సన్నని ట్యూబ్ ప్రవేశపెట్టబడి ఉంది గిరిజతల్లి, గిరిజ చెవిదగ్గరచేరి ''అమ్మా లేతల్లీ' మత్తు వదల్చుకో తల్లీ!'' అని, హీనస్వరంతో అంటున్నది

'బాబాయిగారూ! ఏం జరిగిందంటి పిన్నా?''

''నిన్న సాయంకాలం గిరిజ ఎక్కడికో వెళ్లి, ఒక అరగంటవుండి తిరిగివచ్చిందట. రావడం రావడం ఏడుస్తూ, తన గదిలోకెళ్లి తలుపు వేసుకుందట! ఇంతలో ఎవరో 'గిరిబాబు' అన్న యువకుడు, గిరిజకోసం వచ్చాడు మీ పిన్ని, గదితలుపుతట్టి గిరిజను పిలిచిందట! గిరిజ తలుపుతీసే, గిరిబాబు ఎదుట నిలబడిందట ఏడుస్తూనే వాళ్లిద్దరు కొన్ని క్షణాలు మౌనంగా ఒకర్నొకరు చూసుకున్నారట గిరిబాబు, గిరుక్కున తిరిగి మాటా పలుకులేకుండా వెళ్ళిపోయాడట. ఈ గిరిజ ఇంకా కుళ్ళికుళ్ళి ఏడుస్తూ గదిలోకి వెళ్లిందట!''

సంధ్యకు సాంబశివరావు మాటలవల్ల గిరిజకు ఏర్పడ్డ షాక్ దాదాపు అర్థం అయ్యింది సంధ్య వేరుగా వెళ్లి గిరిజ తలదగ్గర స్టూల్‌మీద కూర్చుంది

''బాబాయి! పిన్నీ! మీరు వెలుపలికి వెళ్లండి!'' అన్నది సంధ్య

సాంబశివరావు తన భార్యను తీసుకొని, మెల్లగా వెలుపలికెళ్ళిపోయాడు సంధ్య గిరిజ చెవిదగ్గర నోరుపెట్టి ''గిరిజా! నేను సంధ్యను'' అన్నది అయినా గిరిజ ముఖంలో ఏమార్పు రాలేదు ''గిరిజా అడుగో గిరిబాబు!'' అన్నది సంధ్య అయినా గిరిజలో చలనంలేదు

''గిరిజా! నీవు మహా రచయిత్రివి! చూడు నీ అభిమానులు, ఎలా దుఃఖిస్తున్నారో?''

''అడుగో గిరిబాబొచ్చాడు!''

ఇలా ఉదయం ఆరుగంటలదాకా, సంధ్య గిరిజకు చెబుతూనే ఉంది

ఆరుగంటలకు గిరిజ సన్నగా మూలిగింది

గిరిజ మూలుగువిని, సాంబశివరావు డాక్టర్ కోసం పరుగెత్తాడు

''గిరిజా నేనే గిరిబాబును ఐయాం సారీ! ఐ లవ్ యూ!'' అన్నది సంధ్య, గిరిజ చెవిలో

ఆ మాటతో గిరిజ ముఖంలోని కండరాలు క్షణం చలించాయి కండ్లలో చలనం కలిగింది కండ్లు తెరవడానికి ప్రయత్నిస్తున్నట్లు సంధ్యకు తోచింది

''గిరిజా! నేను గిరిబాబును నిన్ను ప్రేమిస్తున్నాను''

గిరిజ కనురెప్పలలో సంచలనం ప్రారంభం అయింది

పదినిముషాలయ్యాక డాక్టర్ వచ్చి గిరిజను పరిశీలించాడు ''నేనే గిరిబాబును'' అని సంధ్య, గిరిజ చెవిలో అనడాన్ని వింతగా, ఆశ్చర్యంగా అయినా మెచ్చుకోలుగా చూశాడు డాక్టర్

''మిస్! హూ ఈజ్ దిస్ గిరిబాబు!''

''ఈమె అతడ్ని ప్రేమించింది!''

''అతడ్ని పిలుచుని రాగలవా?''

''రెండు గంటలు పట్టొచ్చు! అప్పటిదాకా గిరిజ''

''ఫోన్‌లో పిలవరాదా, గిరిబాబును!''

''ఫోన్ కాల్‌తో అతడు రాకపోవచ్చు నే స్వయంగా వెళ్లి, పిల్చుకువస్తే వస్తాడేమో?''

''అతనెక్కడుంటాడు?''

''గుంటూరులో!''

''ఊఁ!'' అంటూ డాక్టర్, గిరిజను పరీక్షించి ''రెండు గంటల్లో అతన్ని తీసుకురాగల్గితే ఈమెకు లాభం ఉండవచ్చు!''

''అయితే వెళ్లి తీసుకొస్తాను డాక్టర్''

'పదమ్మా!''

[ఇంకా వుంది]

# చెమటకాయల యొక్క దురద, మంట బాధను మరిచి పోండి.

నైసిల్
ఉపయోగించండి.
అతిశీఘ్రంగా
ఉపశమనమునిచ్చే
చెమటకాయల పౌడరు

చెమటకాయల పౌడర్
మాత్రమే మీకు దురదలు, మంటల
చికాకుల నుండి అతి శీఘ్రంగా
ఉపశమనము నిస్తుంది.
ప్రత్యేకమైన ఔషధీయుక్త నైసిల్
చెమటకాయలను ప్రతి దశలోనూ
ఎదుర్కొంటుంది.

1. అధికమైన చెమటను ఆపుతుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధకారియైన సూక్ష్మ జీవులను నాశనము చేస్తుంది.
4. శరీరమునకు ఉపశమనము నిస్తుంది.

2 ప్యాక్‌లలో
దొరుకును —
"బ్లూ" మరియు
"శాండల్ వుడ్"

**నైసిల్ పొందండి.**
**చెమటకాయలను మరువండి.**
**కేవలం 6 రూపాయల 63 పైసలు.***

*గరిష్ఠ రీటైల్ ధర. స్థానిక పన్నులు అదనం

Glaxo
nycil
PRICKLY HEAT POWDER

GN-79-364-Tel

## * * సినిమా విశేషాలు * *

—జి.వి.జి.

### చుట్టాలున్నారు జాగ్రత్త! రమేష్ ఆడిన నాటకం

అమృతా ఫిలిమ్స్ వారి సెట్‌లో కృష్ణ, శ్రీదేవి ...

"ఆశ్చర్యంగా ఉందే! మీ ఇద్దరూ ఒకే విధంగా ఉన్నారా?" అంది వనజ.

"అవును; ఆ పోలికే ఇంత అనర్థానికి దారి తీసింది ... ఆ రాత్రి మీ ఇంట్లో చూసింది నన్ను కాదు! దొంగతనానికి వచ్చిన గంగుల్ని," అన్నాడు రమేష్.

"నీకెవరు చెప్పారు?"

"ఆ గంగులే. నన్ను జైల్లో కలిశాడు. వాడికి నిన్న ప్రొద్దున విడుదల. వాణ్ని నా ప్లేస్‌లో ఉంచి, వాడిబట్టలు వేసుకొని నేను బయటకు వచ్చాను. నేను గంగుల్నే అనుకొని మీ బాబాయ్ నాకు లంచమిచ్చి, నాటకమాడమన్నాడు."

"ఈ నాటకంతో వాళ్ళకు తిక్క కుదిరింది... మరి; ఇప్పుడు మనం పోయేదెక్కడికి?"

"మా ఊరు. నిన్ను మా అమ్మకప్పగించి, నేను మళ్ళీ జైలుకెళ్ళి, గంగుల్ని బయటకు పంపెయ్యాలి!"

వనజ నివ్వెరపోతూ అతన్ని అనుసరించింది.

కృష్ణ ద్విపాత్రాభినయం నిర్వహించే "చుట్టాలున్నారు జాగ్రత్త"లో కవిత, రావుగోపాలరావు, నూతన్‌ప్రసాద్, బాలయ్య, మిక్కిలినేని, వంకాయల, ప్రభాకర్, సూర్యకాంతం, మమత, నిర్మల, శ్యామల వగైరా తారాగణం. ఈ చిత్రాన్ని సమర్పించే బాలయ్య రాసిన కథకు డి. వి. నరసరాజు మాటలు రాశారు. సి. నారాయణరెడ్డి, కొసరాజు, జాలాది గీతాలకు ఎం. ఎస్. విశ్వనాథం బాణీలు కూర్చారు. ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రాహకుడు. కె. రంగారావు సహకార దర్శకుడు. కె. రవికుమార్ నిర్వాహకుడు. బి. వి. ప్రసాద్ దర్శకత్వంలో అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు నిర్మాతలు.

### పైలెట్ ప్రేమనాథ్

నర్రా చంద్రశేఖరరావు సమర్పించే ఆర్. కె. పిక్చర్స్ "పైలెట్ ప్రేమ్‌నాథ్" చిత్రం డబ్బింగ్ మొదలైంది. తమిళంలో విజయవంతంగా నడిచిన ఈ చిత్రం పూర్తిగా సిలోన్‌లో తయారైంది. శివాజీ గణేశన్, శ్రీదేవి, జయచిత్ర, విజయకుమార్ ముఖ్య తారాగణం. మే నెలలో విడుదల చెయ్యదలచినట్లు నిర్మాత గుమ్మళ్ళ లక్ష్మణరావు చెప్పారు. మాటలు, పాటలు: రాజశ్రీ. సంగీతం: ఎం. ఎస్. విశ్వనాథన్. ఛాయ: సుందరం. నిర్మాణత: గుమ్మళ్ళ చిరంజీవి. నిర్మాణ నిర్వహణ: నర్రా రవీంద్ర, గుమ్మళ్ళ గణేశ్‌బాబు.

'త్రిలోక సుందరి'లో జయమాలిని

# గోద్రెజ్
# సేఫ్ మైరా



## ఇది మీరు సొంతం చేసుకోడానికి ప్రత్యేకమైన కారణాలు అనేకం: భద్రత. ఉపయోగం. డబ్బుకు పూర్తి విలువ.

పూర్తిగా భద్రతని యివ్వడం కోసం తయారు చేయబడినది...మీ ఆభరణాలు, దస్తా వేజులు, విలువైన యింకా అనేక వస్తువుల్ని జాగ్రత్తగా, భద్రంగా పెట్టుకోవచ్చు. తుప్పును నిరోధించ గలగటానికి యిది ప్రత్యేకంగా 'ప్రోసెస్' చేయబడిన 1.6 మి.మీలు (16 గేజ్) స్టీల్‌తో తయారు చేయబడినది. దీనికి దానియొక్క తాళం చెవితో తప్ప మీరే తాళం చెవితోనూ తీయడానికి ఏ మాత్రం వీల్లేని గోద్రెజ్ వారి 'లాక్' బిగించబడింది. దీనిలో విశాలమైన జాగా గల లాకర్‌లో రహస్యమైన అర వుంది, మరి దాన్ని తెరవాలంటే 3 తాళపు చెవులు కావాలి!

**వస్తువులు పెట్టుకోడానికి కావలసినంత జాగా:** 'సేఫ్ మైరా' నిజంగా ఎంతో విశాలమైనది. పూర్తిగా విశాలమైన 'షెల్ఫ్‌లు' చిన్నవిగా, పెద్దవిగా చేసుకునే వీలు. బట్టలు తగిలించుకోడానికి 'వార్డ్రోబ్'లో వున్నంతగా బాగా లోతైన జాగా, నలిగిపోకుండా, ముడతలు పడకుండా.

**మరిన్ని వీళ్ళు:** ఎన్నో రకాల్లో, మూడు రంగుల్లో, ప్రతిదానికీ, మీరు పెట్టే డబ్బుకు పూర్తి విలువ ముడుతుంది. అన్ని మోడల్సూ స్టాకులో సిద్ధంగా ఉన్నాయి, దొరుకుతున్నాయి.

Godrej

ప్రఖ్యాతి చెందిన వస్తువులు
నిర్మించేవారు— గోద్రెజ్

ULKA-GBS-4/9 TE



'పున్నమి నాగు'లో రతి

## నటుడు మాదాల రంగారావు సారథ్యంలో 'యువతరం కదిలింది'

''ఎన్నికల అనంతరం జరిగిన రాజకీయ మార్పులకు యువతలేస్తున్న, వేయనున్న ముందడుగులు ప్రధానాంశంగా స్క్రిప్ట్ తయారుచేశాం. మొదట్లో మేం అనుకున్న డైరెక్టర్ వి మధుసూదనరావుగారికి ఈ సంవత్సరాంతంవరకు ఖాళీ లేనందువల్ల, వారి సలహా మేరకు ధవళ సత్యంకు దర్శకత్వ బాధ్యతలను అప్పగించాం,'' అన్నారు మాదాల రంగారావు ఎం ఎ. ఈయన రాసిన కథకు నవతరం యూనిట్ సంభాషణలు తయారు చేసింది. తాతినేని చలపతిరావు సంగీతంలో రామకృష్ణ, విజయలక్ష్మిశర్మ పాడిన అదృష్టదీపక్, ఎం ఎ విరచితగీతం మార్చి 26 ఉదయం ధ్వనిముద్రిక చేయబడింది. ఆచారాలు, ఆర్భాటాలు, పూజాపునస్కారాలు లేకుండా తొలిపాట నిరాడంబరంగా రికార్డ్ చేయబడడం మరో విశేషం. మోహన్‌కృష్ణ ఛాయ, రంగారావు శిల్పం, నాయని మహేశ్వరరావు కూర్పు నిర్వహిస్తారు. ''ఏప్రిల్ ఏడవతేదీలోగా ఏడుపాటలు రికార్డ్ చేయబడతాయి. ఏప్రిల్ 20నుంచి మే 20వరకు ఒకే షెడ్యూల్‌లో పూర్తిగా ఒంగోలులో చిత్రీకరణ పూర్తవుతుంది,'' అన్నారు నిర్మాత మాదాల కోదండరామయ్య.




'సిమటపాకాయ్ ఒకటి, రెండు, మూడు'లో
మాస్టర్ రామకృష్ణ

## మోసగాడు లో సీత, గీత

సీత (శ్రీదేవి), గీత (శ్రీదేవి) ఒక తల్లి బిడ్డలు కాని, వారు పెంచుకున్న జీవన దృక్పథాలు వేరు సీత కాలేజీలో చదువుతూ, జీవితం మీద ఎన్నో ఆశలు, ఆశయాలు ఏర్పరుచుకుంది గీత ఒక సగటు బజారుమనిషిగా బ్రతుకుతూ, మానానికి వెలకట్టిన వెలయాలుగా

మిగిలింది

తనకు తోడు నీడగా కలకాలం కలిసి ఉండాలనుకునే జగన్ (శోభన్‌బాబు)ను ఒకనాడు గీత వద్దకు తీసుకొచ్చింది సీత "అక్కా!"

"సీతా! నువ్వా? ఎన్నాళ్ళయింది నిన్ను చూసి! నువ్వెళ్ళిన రోజునుంచి నీ విషయమే తెలియలేదు ఏమిటి సంగతి? ఎలా ఉంటున్నావు?" కంటిలో నీటి పొర, గొంతులో జీర అడ్డం పడగా అడిగింది గీత

"ఆ రోజే చెప్పానుగా, అక్కా – ఇలాంటి వాతావరణం నుంచి వెళ్ళిపోయి స్వయం కృషితో బ్రతుకుతానని, ఉద్యోగం చేసుకుంటూ నా కాళ్ళ మీద నేను నిలబడతానని? అంతే కాదు, నేను అనుకున్నట్లే – నన్ను ప్రేమించి పెళ్ళి చేసుకోబోయే మనిషిని సంపాదించుకున్నాను," అంది సీత, జగన్ వంక చిరుగర్వంతో చూస్తూ

"రియల్లీ! చాలా సంతోషం, సీతా! నమ్ముకున్న ఆశయాన్ని నెరవేర్చుకుంటున్న నిన్ను చూసి నేను చాలా గర్వపడుతున్నాను," అంది గీత

జగన్‌ను సీత పరిచయం చేయగానే "నమస్కారమండి పది తరాలు వెనక్కి చూసి పిల్లనిచ్చి పెద్దలు తేల్చే ఈ రోజుల్లో -- మా సీతను మనస్ఫూర్తిగా ప్రేమించి పెళ్ళి చేసుకోడానికి సిద్ధపడ్డ మీరు" అంటూ తన సంతోషాన్ని మాటలలోకి తర్జుమా చేయబోయింది

ఇంతలో జగన్ "నన్నేం పొగడక్కరలేదు ఏ మచ్చా లేని స్వచ్ఛమైన సీత ఎవరికి ఎక్కడ పుట్టినా – అది నా కోసమేనని నా నమ్మకం అందుకే నా బ్రతుకులో అడుగుపెట్టింది దైవసాక్షిగా సీతను నేను పెళ్ళి చేసుకోబోతున్నాను," అన్నాడు

"మీలాంటి వ్యక్తి మా సీతకు భర్త కాబోతున్నందుకు నాకెంతో సంతోషంగా ఉంది," అంటూ సీతవంక తిరిగి, "సీతా, పెళ్ళనేది వినటం, దూరంనుంచి చూడటం తప్ప – నా అన్నవాళ్ళకు జరగ్గా నేనెన్నడూ చూడలేదు అందుకే మీ పెళ్ళికి నన్ను పిలిస్తే, చెల్లెలి పెళ్ళికి అడిగి ఆహ్వానం పొందాల్సిన దుస్థితి మరే స్త్రీకీ రాకూడదు," అంది గీత

"తప్పకుండా, అక్కా! ఎవరున్నా లేకపోయినా – దైవం, నువ్వు ఉండితీరుతారు మా పెళ్ళికి," అంటూ అప్పుడే ఆహ్వానించింది సీత

ఒక స్త్రీ అరుంధతిగా పూజింపబడినా – మరొక స్త్రీ వారకాంతగా మారి సంఘంచేత బహిష్కరింపబడినా – కేవలం పరిస్థితుల ప్రభావం వల్లనే జరుగుతుందనేది నగ్నసత్యం

కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో టి క్రాంతికుమార్ నిర్మించిన అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్ "మోసగాడు" చిత్రం మే మొదటి వారంలో విడుదలవుతుంది చిరంజీవి, గుమ్మడి, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య, సారథి, అనిత, నిర్మల ఇతర పాత్రధారులు సత్యానంద్, వేటూరి, చక్రవర్తి, కె ఎస్ ప్రకాష్, భాస్కరరాజు, కోటగిరి వెంకటేశ్వరరావు, వి సత్యనారాయణరెడ్డి, బి గోపాల్, శరత్, పి చంద్రశేఖర్ తెరవెనుక కృషి చేశారు

## "భలే కాపురం"

ఎన్ గోపాలకృష్ణ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో రాజర్షిన్ నిర్మించే పై చిత్రంలో చంద్రమోహన్, జయసుధ హీరో హీరోయిన్‌లు మహదేవన్ సంగీత దర్శకుడు ఈ నెలలోనే షూటింగ్ ప్రారంభమవుతుంది



'మిస్టర్ రజనీకాంత్'లో పద్మాఖన్నా



'అపద్బాంధవుడు'లో గీత

## సినిమా

### రక్తబంధం లో భాగోతం భాష్యం

చెట్టుకింద కూర్చొనున్న పిల్లలకు ధర్మారావు (రమణమూర్తి) మూడు కోతుల బొమ్మలను చూపిస్తూ, "చెడు వినకు చెడు కనకు చెడు అనకు ఇదే బాపూజీ చెప్పిన నీతి," అని బోధిస్తూండగా అక్కడికి వచ్చిన భాగోతం (మాతవ్ ప్రసాద్) "ఏయ్, ముసలాడా! పిల్లలు కదా అని పిచ్చికథలు చెప్పి పాడు చేయకు," అంటూ విద్యార్థుల వంక తిరిగాడు "అబ్బాయిలూ నేనంత చదువుకోకపోయినా — హోల్‌సేల్‌గా ఈ కథలో ఉన్న గమ్మత్తేమిటో చెబుతా వినండి. ఈ కోతి చెడు వినొద్దని చెవులు మూసుకుందా? మరి, మిగతా రెండు వింటున్నాయి కదా? అలాగే— ఈ కోతి చెడు మాట్లాడొద్దని మూతి ముడుచుకున్నా —మిగతారెండూ తెరుచుకునే ఉన్నాయిగా? మరి — మూడోది కళ్ళుమూసుకున్నా — ఈ రెండూ తెరుచుకునే ఉన్నాయిగా? అంటే — హోల్‌సేల్ మొత్తంమీద ఈ కథకర్థమేమిటంటే — ప్రతి ముగ్గుర్లో ఇద్దరు చెడు చూడొచ్చు ఇద్దరు చెడు మాట్లాడొచ్చు ఇద్దరు చెడు వినొచ్చు — అవి," అంటూ తన భాష్యం చెప్పాడు

శీరం లక్ష్మణరావు సమర్పించే రికో ఫిలిమ్స్ "రక్తబంధం"లో చిరంజీవి, ప్రసాద్‌బాబు, త్యాగరాజు, రంజిత్‌బాబు, చంద్రరాజు, సత్తిబాబు, కవిత, రోజారమణి, సువర్ణ, సుమిత్ర, పుష్పలత, జయమాలిని, జయశీల ప్రభృతులు నటవర్గం మోదుకూరి జాన్సన్, జి కె వెంకటేష్, పి భాస్కరరావు, వాయువి మహేశ్వరరావు, శేషు, బి నాగేశ్వరరావు, కవగాల జయకుమార్, రంగారావు మున్నగు వారు సాంకేతికవర్గం ఆలూరి రవి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్ విజయలక్ష్మి, పి ఎన్ కృష్ణ నిర్మాతలు

### కల్యాణ్ సంజయ్ ఇంటర్నేషనల్

డాక్టర్ తాళ్ళూరి కృష్ణకుమారి నాయికగా యు విశ్వేశ్వరరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఒక చిత్రాన్ని 'మన' సత్యం నిర్మిస్తారు శ్రీశ్రీ, కొండవీటి వెంకటకవి కలిసి కథ, మాటలు, పాటలు రాస్తున్నారు తాతినేని చలపతిరావు స్వరకల్పనలో గీతాలు ఈ నెలలోనే టేప్ చేయబడతాయి











## అల్లుడు పట్టిన భరతంలో అమెరికా దంపతుడు

రేఖ మెళ్ళో తాళికట్టిన తక్షణం ఆమెను మాంబావద్దకు తీసుకొచ్చిన ముత్యాలు "అత్తగారూ! మా దంపతుల మిద్దరం మీ దంపతులకు దణ్ణం పెట్టాలి," అన్నాడు

"మా దంపతుడు ఇక్కడెక్కడున్నాడు? అమెరికాలో ఉన్నాడు," అంటూ గొప్ప చాటుకుంటున్న మాంబా మాటకు అడ్డు తగులుతూ, "వచ్చానే! అమెరికానుంచి అద్దెసైకిలేసుకొని మరీ వచ్చాను!" అంటూ ప్రత్యక్షమయ్యాడు ప్రకాశం

అందరూ ఆశ్చర్యపోయారు "మాటవరసకి నిన్ను 'మామా' అని పిలచేవాకు — నువ్వు నిజంగా పిల్లనిచ్చిన మామవికావడం — నాకు చాలా ఆనందంగా ఉంది, మామా!" అన్నాడు ముత్యాలు

"ఇదేమిటి, మాంబాగారూ! ఇతను సైకిలు కొట్టు పెట్టుకొని, ఈ ఊళ్ళోనే ఉన్నాడు నా సైకిలు ఎప్పుడూ ఇతని దగ్గరే రిపేరు చేయించేదాన్ని" స్నేహితురాలు మిసెస్ దత్తు కుండబద్దలు కొట్టినట్లు చెప్పగానే ఇరకాటంలో పడ్డ మాంబా కొంచెం తేరుకొని, "ఏమండీ, నిజమా ఇది? అమెరికాలో మీరుచేస్తున్న బిజినెస్‌లో నష్టంవచ్చిందని ఎప్పుడో పదేళ్ళక్రితం రాశారు మళ్ళీ ఉత్తరాలే లేవు ఎంతనష్టంవస్తే మాత్రం నాకు మొహం చూపించలేక, మనఊళ్ళోనే సైకిల్ కొట్టు పెట్టుకుంటారా? మీకోసం ఎదురుచూసి చూసి, కళ్ళు కాయలు కాచాయంటే నమ్మండి అమెరికాకు ఎన్ని ఉత్తరాలు రాశానో నేను," అని ఎలాగో అనగలిగింది

"అవును, పాపం! నెంబరు 16, అంకాళమ్మ గుడి దగ్గర, గుండువారి వీధి, అమెరికా — అన్న అడ్రసుకు నువ్వురాసిన ఉత్తరాలు చాలా అందాయి నాకు," అంటూ ఒప్పుకున్నాడు ప్రకాశం

"ఊరుకోండి, ఎప్పుడూ మీకు జోకులే వెళ్ళేరోజు జోకేసి నవ్వించి వెళ్ళారు రాగానే మళ్ళీ జోకేశారు రండి మీతో మాట్లాడాలి," అంటూ మేడపైకి దారి తీసింది మాంబా

చిత్రకళా శిల్పి కాశీనాధుని విశ్వనాథ్ దర్శకత్వంలో డి వి ఎస్ రాజు నిర్మించిన డి వి ఎస్ ప్రొడక్షన్స్ "అల్లుడు పట్టిన భరతం" వినోదాత్మక చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, నాగభూషణం, రమాప్రభ, అల్లురామలింగయ్య, పద్మనాభం, మిక్కిలినేని, నిర్మల, సాక్షిరంగారావు, పి ఎల్ నారాయణ, భీమరాజుతో పాటు మరో శృంగార జంటగా రంగనాథ్, కవిత పాల్గొన్నారు జంధ్యాల, చక్రవర్తి, జి కె రాము, కళాధర్, బాబూరావు పి వి రామారావు, నండూరి విజయ్ ప్రభృత సాంకేతిక వర్గం

## 'కొంటె మొగుడు-పెంకి పెళ్ళాం'లో సినిమాలో సినిమా

"సినిమా పిచ్చిఉన్న రమాప్రభ ఆ గ్రామంలోని టూరింగ్‌టాకీస్‌లో 'బుల్లెమ్మ — బుల్లోడు' చిత్రం చూసేందుకు వెళ్ళింది అదే ఊళ్ళో అంతకుముందు పెళ్ళిచూపుల్లో తను చూసిన చలం కూడా వచ్చి పక్కనే కూర్చున్నాడు ఆతన్నీ, తెరమీద కదులుతున్న చలాన్నీ చూసి పోల్చుకొని ఆశ్చర్యపోయి, చలం సరసన నటిస్తున్న విజయలలిత బదులు తనను ఊహించుకొని, ఆ ఊహలో తనే ఆ పాట పాడుతుంది," అంటూ మద్రాసుకు పది మైళ్ళ దూరంలో ఉన్న మాంగాడులోని టెంట్‌లో షూటింగ్ జరిగినప్పుడు వివరించారు డైరెక్టర్ కట్టా సుబ్బారావు చంద్రమోహన్, ప్రభ, నూతన్‌ప్రసాద్, పి ఎల్ నారాయణ, లక్ష్మీకాంత్, రమణమూర్తి, సురేంద్ర, అనిత, సూర్యకాంతం, గిరిజ, కృష్ణవేణి పాత్రధారులు గొల్లపూడి, సత్యం, మోహనకృష్ణ, వీరప్ప, ప్రకాశరావు, సి వి ఎస్ రామారావు, జి ఎన్ బాబు సాంకేతిక సహకారంతో నిర్మించిన యు ఎస్ ఆర్ మోహనరావు "మే రెండవ వారంలో రిలీజ్ చేస్తున్నాం," అన్నారు



మోసగాడు'లో లలిత, సత్యనారాయణ

## "ముత్యాలపందిరి"

కమలహాసన్, సుజాత, సుమిత్ర, పండరీబాయి, సుకుమారి, రాజ్‌బాబు, తేంగాయ్ శ్రీనివాసన్ పాల్గొన్న శిరీషలక్ష్మీ కంబైన్స్‌వారి పై చిత్రానికి రాజశ్రీ మాటలు, పాటలు రాశారు ఎం ఎస్ విశ్వనాథన్ సంగీత దర్శకుడు వి సోమనాథ్ దర్శకత్వంలో ఎన్ చెల్లస్వామి, బి బుజ్జమ్మ నిర్మాతలు

## ఆపద్బాంధవులులో ఆపదపాలైన అబల

రామాలయం నుంచి చెమ్మగిల్లిన కళ్ళతో సూట్‌కేస్ చేత్తో పట్టుకొని బయలుదేరిన జానకి ''అక్కా!'' అన్న పిలుపు వినగానే ఆగి, భారతి వంక చూసింది

''అక్కా! ఎన్నాళ్ళుగానో నిన్నిలా పిలవాలని నా ఆశ. ఈరోజు ఆ అవసరం వచ్చింది. పిలుస్తున్నాను... ఎంతో తెలివిగా పగ తీర్చుకుంటున్నానని భ్రమపడ్డాను. పిచ్చివాడు రాయి విసిరినట్టుగా అయింది నేను గురి చూసింది మునసబు గారికైతే, ఆ దెబ్బ నీకు తగిలింది బావగారి మనస్సులో విషబీజం నాటి నిన్నీ స్థితికి తెచ్చింది నేనేనక్కా! నిజం. నా మాట నమ్మక్కా! ఆ భగవంతుడి సాక్షిగా చెబుతున్నా నేను కోరుకుంది ఆ కుటుంబ పతనమేగాని, నీ కన్నీళ్ళు కాదు. నన్ను క్షమించు,'' అంది భారతి.

''సాటి ఆడదాని సంసారంలో నిప్పులు పోసింది చాలక తప్పు నాదేనని ఒప్పుకుంటున్నావంటే – అది నీ విజాయితీ కాదు; నీ రాక్షసత్వానికి నిదర్శనం. తప్పుకో''

''మనిషి రాక్షసిగా మారటానికి కారణం ఉంటుందని నువ్వు నమ్మితే – నా సంజాయిషీ విని మరీ వెళ్ళక్కా!'' అంటూ జానకి పాదాలు పట్టుకోబోయింది భారతి

జానకి దూరంజరిగి, ''హుఁ! నీ సంజాయిషీ– కూలిపోయిన నా సంసార వృక్షాన్ని చిగురింప చేయగలదా? కన్నీటి ప్రవాహంలో కొట్టుకు



'రాం రాంబర్ట్ రహీం'లో కృష్ణ

పోతున్న నా జీవిత నౌకను ఒడ్డుకు చేర్చగలదా?'' అంది.

''బావగారి ముందు నా తప్పు ఒప్పుకుంటానక్కా! కావాలని నేను ఆడిన నాటకమంతా ఆయన ముందు బట్టబయలు చేస్తాను. బావగారు నిజం తెలుసుకొని నిన్ను స్వీకరిస్తారక్కా!''

''బలవంతాన బలిపీఠం ఎక్కించి, పునర్జన్మ బావుంటుందని నచ్చచెపుతున్నావన్నమాట?''

''నువ్వెక్కింది బలిపీఠం కాదక్కా; న్యాయ పీఠం. ఒక అమాయకురాలికి జరిగిన అన్యాయానికి, ఒక మోసగాడు చేసిన దౌర్జన్యానికి భగవంతుడి తీర్పు దొరకటం దుర్లభమని తెలిసి–న్యాయమూర్తి స్థానంలో నిన్ను కూర్చోపెట్టాను నీ తీర్పుమీదే అంతా ఆధారపడి ఉంది రా, అక్కా! తీర్పు చెబుతువుగాని,'' అంటూ జానకి చెయ్యి పట్టుకొని బయలుదేరింది భారతి

శారద, గీత సరసన శ్రీధర్, చక్రపాణి నటించిన శ్రీ అపర్ణా మూవీస్ ''ఆపద్బాంధవులు'' చిత్రంలో పద్మనాభం, రాళ్ళపల్లి, సాక్షి రంగారావు, మాలి, ఎర్రంనేని చంద్రమౌళి, ఎన్. వి జగ్గారావు, జయవాణి పాత్రధారులు. వై ఈశ్వరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, నిర్మాణ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. పరుచూరి సంభాషణలకర్త సత్యం సంగీత దర్శకుడు. డి. వెంకటరత్నం సంకలనకర్త. సరస్వతీకుమార్ సహదర్శకుడు



'మంగళగౌరి'లో శారద, మురళీమోహన్, సుభద్ర

## సినిమా



## రామకృష్ణా స్టూడియోస్ కొత్త చిత్రం

ఎన్. టి. ఆర్. శ్రీదేవి, జగ్గయ్య, సత్యనారాయణ, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, రాజ్‌బాబు, రాజ్యలక్ష్మి, కవిత, ఎస్ వరలక్ష్మి, చందనా చౌదరి, సుకుమారి గెస్ట్‌గా గీత పాల్గొనే చిత్రాన్ని కె. బాపయ్య దర్శకత్వంలో హరికృష్ణ నిర్మిస్తున్నారు ఈ ప్రొడక్షన్ నెంబరు 9కి ఏప్రిల్ 2వ ప్రారంభోత్సవం జరిగింది. గుహానాథన్ కథకు గొల్లపూడి మారుతీరావు సంభాషణలు రాశారు. మహదేవన్ స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు. మోహన్‌కృష్ణ ఛాయ, ఎస్. కృష్ణారావు శిల్పం నిర్వహిస్తున్నారు. "ఉమ్మడి కుటుంబం" చిత్రాన్ని ఎన్. టి. ఆర్. హిందీలో స్వీయ దర్శకత్వంలో నిర్మించడానికి నిశ్చయించారు ఆయన పాత్రను బాలకృష్ణ ధరిస్తారు. 1981 సంక్రాంతి దినాన షూటింగ్ ప్రారంభమవుతుంది.

## "బండోడు – గుండమ్మ"లో కృష్ణ ద్విపాత్రాభినయం

"రాధమ్మ పెళ్ళి" అనంతరం ఏడేళ్ళకు దాసరి, కృష్ణ కాంబినేషన్‌లో తయారయ్యే విజయలక్ష్మి మూవీస్ పై చిత్రం షూటింగ్‌ను నిర్మాత జి. వి. ఎస్ రాజు ఏప్రిల్ 10వ ప్రారంభించారు. జయప్రద, ప్రభ నాయికలు. రావుగోపాలరావు, అల్లు రామలింగయ్య, హరిప్రసాద్, నిర్మల, భావన, కృష్ణవేణి తక్కిన పాత్రలు నిర్వహిస్తున్నారు. వేటూరి, చక్రవర్తి, కన్నప్ప, భాస్కరరాజా, బాలు, కమల్‌తేజ్, శివరాజా, శాస్త్రి తెరవెనుక కృషి చేస్తున్నారు.

## అన్నపూర్ణ సినీ ఎంటర్ ప్రైజెస్ చిత్రానికి దాసరి

"మోసగాడు" చిత్రం మేలో విడుదలవగానే ఎన్. టి. ఆర్. – దాసరి కాంబినేషన్‌తో ఒక భారీ చిత్రాన్ని జూలై 1న – నిర్మాత క్రాంతికుమార్ మొదలెట్టబోతున్నారు. శ్రీదేవి, సత్యనారాయణ, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య ఆదిగా గల వారుంటారు. చక్రవర్తి సంగీతంలో వేటూరి గీతాలు జూన్‌లో రికార్డు చేయబడతాయి.

## పాటగాడు

రేవతి ఆర్ట్స్ పతాకంలో డి. ముత్యాలరెడ్డి సమర్పించే "పాటగాడు"లో కమలహాసన్, శ్రీదేవి, నాగేష్ పాల్గొన్నారు. రాజశ్రీ, చక్రవర్తి, రామమూర్తి రచన, సంగీతం, ఛాయ నిర్వహించారు. దర్శకుడు: ఆర్. త్యాగరాజన్. నిర్మాత: పి. వి. సుబ్బారాయుడు.

## "రాణీ కాసుల రంగమ్మ"

"రాజమండ్రి పరిసర ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ ఫినిష్ అవుతుంది," అన్నారు అనిల్ ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే టి. ఎల్. వి. ప్రసాద్. చిరంజీవి, జగ్గయ్య, నూతన్ ప్రసాద్, రాళ్ళపల్లి, జయమాలిని ముఖ్య నటవర్గం. దాసం గోపాలకృష్ణ, చక్రవర్తి, దేవరాజ్, తోట, యడ్లమూడి ప్రసాద్ వగైరా సాంకేతిక వర్గం నిర్మాత తాతినేని ప్రకాశరావు దర్శకత్వంలో మరో అనిల్ ప్రొడక్షన్స్ చిత్రం జూలైలో ప్రారంభమవుతుంది. సుజాత ద్విపాత్రలు



'ఓ యింటి భాగోతం'లో దీప

నిర్వహిస్తుంది మురళీమోహన్, శ్రీధర్, జగ్గయ్య తక్కిన ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. రమేష్ నాయుడు సంగీత మిస్తారు.

## ఛలోక్తులు - చమత్కారాలు - చురకలు

"మొన్న నా పరమానందయ్య శిష్యుల కథ చిత్రాన్ని రాజమండ్రి జైలులోని ఖైదీలకు చూపించారట," అని ఒకసారి హాస్య నటుడు కీ॥ శే॥ కస్తూరి శివరావు అంటే, "పాపం, ఆ ఖైదీలకు ఈ ఆదనపు శిక్ష కూడానా?" అన్నారట స్వర్గీయ సి.ఎస్ ఆర్. ఆంజనేయులు.

* * *

హడవిడిగా షూటింగ్ ముగించుకొని బయలుదేరబోతున్న నిర్మల, రమాప్రభను చూసి, "వస్తానమ్మాయ్. రాత్రి బండికి వెళ్తున్నా 'మూడుముళ్ళబంధం' షూటింగ్ కోసం అన్నట్టు ఆ చిత్రంలో మీ ఆయన శరత్‌బాబు హీరో కదూ? ఆయనకేమైనా చెప్పాలా?" అని అడిగింది.

"చెప్పడమేనా? లేక—నీకిక్కడ నేనేదైనా ఇస్తే, దాన్ని నువ్వక్కడ ఆయనకు అందజేయగలవా?" అంది రమాప్రభ.

ఆ మాటల్లోని చిలిపిదనాన్ని గుర్తించిన నిర్మల 'నువ్వు నాకిచ్చేదేదో ఓ పసిపాప మునలమ్మకు ఇచ్చినట్టుంటుంది. నేనక్కడ ఆ అబ్బాయికి దాన్ని అందజేసేటప్పుడు ఓ చిన్నబిడ్డకు ముసలమ్మ ఇచ్చినట్లుంటుంది. ఇందులో నీకేం థ్రిల్ ఉంటుంది, పిచ్చిపిల్లా!" అందట

* * *

పూర్వ దేశాల్లో "రాముడు – పరశురాముడు" చిత్రం షూటింగ్ ముగించుకు వచ్చాక డైరెక్టర్ గోపీనాథ్ మద్రాసులో ఏర్పాటు చేసిన పత్రికాకర్తల సమావేశంలో హీరో శోభన్‌బాబు అక్కడి విశేషాలను ముచ్చటిస్తూ, 'మొత్తంమీద హనీమూన్‌కు వెళ్ళొచ్చినట్లుంది నాకు," అని ముగించారు.

ఆ తర్వాత ఉపన్యసించిన మేజర్ సుందర్ రాజన్ (ఇదే తమిళ చిత్రంలో పాత్రధారి) "శోభన్‌బాబుగారు ఇలాఅన్నాక నాకో ఐడియా తట్టింది. ఇటుపైన తండ్రి పాత్రలు ధరించే నాలాంటివారికికూడా విదేశాల్లో షూటింగ్‌లకు తీసుకెళ్తే, హీరోయిన్‌లను జాగ్రత్తగా చూసుకోడానికి వీలవుతుంది కదా?" అనే సరికి అందరూ గొల్లున నవ్వారు

## ఎం. కరుణానిధి సమర్పించే తొలి తెలుగు చిత్రం

కృష్ణతో డి. ఎం. కె. నాయకుడు కరుణానిధి తెలుగులో సమర్పించే పూంపుహార్ ప్రొడక్షన్స్ చిత్రం షూటింగ్ జూన్ 10న మైసూరు లలితమహల్ పేలెస్‌లో మొదలవుతుంది. "సెప్టెంబరు 26కు నాలుగు షెడ్యూల్స్‌తో పూర్తవుతుంది." అన్నారు డైరెక్టర్ అమృతం (కరుణానిధిమేనల్లుడు). శంకరాభరణం రాజ్యలక్ష్మి, రజనీశర్మ నాయికలు. సత్యనారాయణ, నూతన్ ప్రసాద్, గుమ్మడి, సారథి, జయమాలిని, పుష్పలత ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. మహారథి రచయిత. ఎం. ఎస్. విశ్వనాథం స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాస్తారు. మణి ఛాయాగ్రాహకుడు. వెంకటరత్నం సంకలనకర్త. "పాటలు మేలో

## "కళాసాగర్" 6వ అవార్డులు

| | | |
|---|---|---|
| ఉత్తమ చిత్రం | : | శంకరాభరణం |
| ఉత్తమ ప్రశంస | | నీడ |
| ,, దర్శకుడు | . | కె. విశ్వనాథ్ (శంకరాభరణం) |
| ,, ప్రశంస | : | కె. బాలచందర్ (గుప్పెడుమనసు) |
| ,, నటుడు | : | జె. వి. సోమయాజులు (శంకరాభరణం) |
| ,, కేరెక్టర్ ఆక్టర్ | : | గుమ్మడి (నిజం) |
| ,, నటి | : | సుజాత (గుప్పెడుమనసు) |
| ,, కేరెక్టర్ ఆక్ట్రెస్ | : | నిర్మల (రారా కృష్ణయ్య) |
| ,, సహాయ నటుడు | : | పి. ఎల్. నారాయణ (కలియుగ మహాభారతం) |
| ,, సహాయ నటి | · | సరిత (గుప్పెడుమనసు) |
| ,, హాస్య నటుడు | . | రాళ్ళపల్లి (తూర్పు వెళ్ళే రైలు) |
| ,, కథ | : | నిజం (రాచకొండ విశ్వనాథశాస్త్రి) |
| ,, గీతం | · | "గోరింటాకు"లోని "గోరింటా పూచింది" (కీ॥ శే॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి) |
| ,, నేపథ్య గాయకుడు | . | ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం (శంకరాభరణం) |
| ,, ,, గాయని | : | ఎస్. జానకి (శంకరాభరణం) |
| ,, సంగీత దర్శకుడు | : | కె. వి. మహదేవన్ (శంకరాభరణం) |

ఆగస్టు 10న 'మ్యూజిక్ అకాడమీ'లో బహుమతీ ప్రదానోత్సవం జరుగుతుందని కార్యదర్శి టి. వి. కె. శాస్త్రి తెలియజేశారు.

## సినిమా

రికార్డు చేయబడతాయి," అన్నారు నిర్మాణ బాధ్యతలు వహించే " కిశోర్ పూంపుహార్ సంస్థ లోగడ తమిళంలో ఇరవై చిత్రాలు తయారుచేసిందని తెలియజేశారు నిర్మాత సెల్వం

## రిజిస్టర్ చెయబడిన కొత్త చిత్రాల పేర్లు

జ్యోతి చిత్రవారి "రామన్న – భీమన్న", శ్రీ మూవీస్ "ఊరేగింపు", విజయలక్ష్మి చిత్ర "తల్లి గోదావరి", జ్యోతిచిత్ర "రాగం తానం పల్లవి", అన్నపూర్ణ స్టూడియోస్ "చిట్టిబాబాయి", నవరస ఆర్ట్ పిక్చర్స్ "పేరంటాళ్ళు", ప్రసాద్ చంద్ర మూవీస్ "అన్నా కెరినా", శ్రీ శివశక్తి కంబైన్స్ "జనరుద్ర భక్త మార్కండేయ", కిరణ్ చిత్ర "తెల్లచీర–మల్లెపువ్వు", తారకప్రభు ఇంటర్నేషనల్ "లలిత పద్మిని రాగిణి", జగపతి ఆర్ట్ పిక్చర్స్ "బ్రహ్మముడి", శ్రీ హేమా ఆర్ట్ ఫిలిమ్స్ "వరాలిచ్చే దేవుళ్ళు", మదర్‌లాండ్ మూవీస్ "మిస్టర్ మనోహర్", రామ్ శ్యామ్ క్రియేషన్స్ "రామాయణంలో పిడకల వేట", ఎస్. ఎం. కె. క్రియేషన్స్ "భలే బాబు", ఎ. ఎల్. ఎస్. ప్రొడక్షన్స్ "రంగ", మణి ఆర్ట్ ఎంటర్‌ప్రైసెస్ "మహాదుర్గ విజయం", మారుతి ప్రొడక్షన్స్ "వల్లపూనలు", విజయశ్రీ ఆర్ట్ పిక్చర్స్ "పెద్దోడు – చిన్నోడు", ఎ. వి. ఎం. ప్రొడక్షన్స్ "నాగు", గుప్తా ఫిలిమ్స్ "కత్తి సాధిస్తా", మణి ఆర్ట్ ఎంటర్‌ప్రైసెస్ "మార్కండేయ విజయం" తారకపద్మ ఫిలిమ్స్ "సిస్టర్ సుధ", సన్ ఇంటర్నేషనల్ ఫిలిమ్స్ "నాతిచరామి", శ్రీ సూర్యమూవీస్ "ఇదో మలుపు, మరదలు పిల్ల" 

# ప్రశ్నావళి

-కె. రామలక్ష్మి

ఎస్. ఎ. ఎస్. — కామారెడ్డి

అందమైన వస్తువులను చూడడం, ఆనందకరమైన పనులుచేయడం లేకపోతే జీవితం ఎలా వుంటుంది ?

★ రసహీనంగా వుంటుంది. కాని ఒక్కటి మీ అందమైన వస్తువు పక్కింటాయన భార్యా, మీ ఆనందకరమైన పని ఎదుటి వాడికి బాధా కానంతవరకు ఫరవాలేదు

పి. ఎస్. బి. — హైదరాబాదు

మొన్నటిదాకా హృదయాన్ని స్పందింపచేసే కవిత్వం అందించిన కవులే నేడు హృదయాన్ని రగిల్చే సాహిత్యాన్ని అందిస్తున్నారు. వచవేనా ?

★ మీరు కోరిన పాటలవి ! !

ఎ. ఎస్. — ఉండి

నేను ఏ సినిమా చూసినా హీరోయిన్ చచ్చినా ఏడుపురాదు నా పక్కవాళ్ళు ఏడుస్తే నవ్వొస్తుంది మా అక్క నీకు రసహృదయం లేదంటుంది సినిమా కాలక్షేపానికి చూస్తాంగాని ఏడవడానికి కాదంటాను.

★ మీరూ రైటే మీ అక్కయ్యా రైటే అందరూ — ఒకలాగే రియాక్టుకారు సాధారణంగా స్త్రీలు మెదడుతో కాకుండా మనస్సుతో ఆలోచించి ఆవేదన పడిపోతారు అది బలహీనతకాదు, మీది మొండితనమూ కాదు.

కె. జి. ఎస్. — కుప్పం

ఒకపనిని మనం కష్టపడి సాధించినప్పుడు కలిగే సంతోషం, సంతృప్తి యితరుల సహకారంతో సాధించినప్పుడు కలుగదు ఎందుచేత ?

★ ఆ విజయంలో సహకరించిన వారి భాగం కూడా వుందనిపించడంవల్ల.

మాతృసేవ గొప్పదా ? దేశసేవ గొప్పదా ?

★ బాగుంది — దేశంమటుకు మాతృదేవత కాదా యేమిటి ?' అంటారు రాజకీయ వాదులు

డి. ఎస్. ఆర్. — మిట్టపల్లి

గతాన్ని గుర్తుచేసుకుంటే ఏదో వెలితిగా వుంటుంది. ఎందుకని ?

★ అప్పుడు పెళ్లి కాలేదేమో !

స్త్రీకి సమాన హక్కు అంటే ఏమిటో వివరిస్తారా ?

★ ఏముందీ, 'నువ్వు దగ్గు. నేను వక్కలు ఎగుర వేస్తా' నంటూ — అన్నిపనులూ అన్ని రంగాలా — సగం — సగంగా పంచుకోడమే కదా — సమాన హక్కులు అంటే !

కబీర్ — నెల్లూరు

"సంపాదన మరిగిన ఆడది మగవాడి అదుపు ఆజ్ఞలలో వుండదట. పుట్టిన దగ్గరనుంచి చచ్చేదాకా దండనలో వుండవలసినదేనట స్త్రీ. అలా వుండని పక్షంలో వంశగౌరవం మట్టిలో కలియుటయేగాక తానూ మట్టిలోనే కలిసి పోతుందట" అని ఒక రచయిత్రి అంది. కరక్టే అనిపిస్తుంది.

★ శుభం స్వంతకొంపలో అవాలుపెట్టండి మంచినీతి భార్యల ఆర్థికాదాయంమీద మమకారమే గాని వారికి ఖర్చుచేసుకునే హక్కు న్యాయసమ్మతం కాదనుకునే వాళ్ళూ, అలాంటి ద్వంద్వ నీతిలోపడి కొట్టుకుంటూ తమ మనోవైకల్యాన్నీ, రుగ్మతలనీ — శాస్త్రంగా నిరూపించాలని తాపత్రయపడే రచయితలని — అలా వెలవకూడదు పుట్టుక, చావు కూడా ఆడది మగవాడికి అందించిన భిక్ష అని మరిచి పోకండి

ఎల్. వి. ఎస్. — గూడూరు

మీరు ప్రతి నవలలోనూ మగవారిని కించపరిచారు దుర్మార్గులుగా వ్రాస్తారు. ఆడవారిని గురించి అలా వ్రాయరు ఉదా: మీరు రాసిన దారితప్పిన తండ్రి, గోరింటాకు, కోటిగాడు వీటిలో మగవారిని దుర్మార్గులుగా వ్రాశారు.

★ దారితప్పిన తండ్రి పేరులోనేవుంది ? కాని దానిలోనే ఏనబు లేడా ; ఎంత మంచి తండ్రి ! గోరింటాకులో రావుడు తండ్రిలాంటి వాళ్లని మీరు చూడలేదా , స్వప్న తండ్రి ఎంత ఉన్నతుడు? కథనుపట్టి పాత్రలుంటాయి. థీమునిపట్టి వాటికి ప్రాధాన్యం యివ్వడం, యివ్వకపోవడం వుంటుంది. నేను ఎక్కువగా స్త్రీ పాత్రలకి ప్రాధాన్యం యివ్వడం వల్ల మీకు అలా అనిపిస్తుందేగాని — పరిశీలిస్తే ఇలా అనరు !

ఎమ్. ఆర్. ఆర్. — అనంతపురం

ప్రేమించడం సులభమా ? వివాహమాడ్డం సులభమా ? ఎందుకు ?

★ ఎందుకేమిటి ? ప్రేమించడం బాధ్యతతో కూడుకున్నపని పెళ్లి పెద్దలు చేసేస్తారు. కావలిస్తే తరవాతే ప్రేమించుకోవచ్చు

ఎమ్. ఎస్. కె. — దుగ్గుదురు

మీ ప్రశ్నావళి నాకు నచ్చుతుంది. తగిన సమాధానాలు యిస్తారండి.

★ థ్యాంక్యూ. కాని వాటినే 'తలతిరుగుడు' సమాధానాలంటున్నారు కొందరు. ఏం చేద్దాం సోదరీ !

# రేపటి నిర్ణయం

పి.వి.ఆర్. శివకుమార్



''ఆదిత్య హృదయం పుణ్యం సర్వశత్రు వినాశనం
జయావహం జపేన్నిత్యం అక్షయం పరమం
శుభం...''

'ఆదిత్య హృదయం' పఠిస్తూ బాత్‌రూమ్‌లోంచి బయటకు వచ్చారు జానకిరామయ్యగారు. మెళ్లోని జందెంను తువాలుతో తుడుచుకుంటూ వంటగదిలోకి వెళ్లారు. మరో రెండు నిముషాల్లో ఆదిత్య హృదయం పూర్తయింది. ఈలోగా పీట వాల్చుకుని మడినీళ్లు పెట్టుకోవడమూ అయింది. సంధ్యావందన ముగిస్తూనే లేచి స్టౌ దగ్గరకు నడిచారు. కాఫీ కాచి, రెండుకప్పుల్లో పోసుకుని ముందుగదిలోకి వెళ్లారు. మచంమీదే ఇంకాగురకలు తీస్తున్నాడు సూర్యనారాయణ.

''లేవరా సూర్యం, ఆరు దాటుతోంది'' అంటూ అతడిని లేపారు. బద్ధకంగా ఆవులిస్తూ లేచి, తండ్రి బల్లమీద వుంచిన కాఫీకప్పు అందుకున్నాడు. యూనివర్సిటీ పరీక్షలకని అర్ధరాత్రిదాకా మేలుకుని చదువుతున్న కొడుకుమీద జానకి రామయ్యగారికి అమితమైన ప్రేమ!

## 2

ఆమెపేరు మధుర. జానకిరామయ్యకి ఆమెతో పరిచయం వయసు పదేళ్లుగా. అంటే పరిచయమై పదేళ్లయిందనికాదు. పదేళ్లవయసులో ఆమెతో పరిచయమయింది. హైస్కూల్లో చేరిన ఏడే జానకిరామయ్యకి ఉపనయనమయింది. 'గుండూ — పిలకా' అంటూ తోటివాళ్లు ఏడిపిస్తుంటే ఏడుపో, ఉక్రోషమో కాక కోపమే వచ్చేదతనికి.

''ఏరా, క్రీస్తు సిలువమెళ్లో వేసుకుంటూ, 'ఆమెన్' ప్రార్థనలు చేసే ఏసుపాదం అన్నా, ఒంటిగంట కాగానే తలకు రుమాలు చుట్టుకుని, నమాజ్‌చేసే అబ్దుల్‌భాయ్ అన్నా మీకే వెక్కిరింపూ లేదు. మరి నేను గుండు—పిలకతో సంధ్యావందనం చేసుకుంటే మాత్రం ఎందుకా వెక్కిరింపు?'' అంటూ దెబ్బలాడేవాడు.

''కావాలంటే నువ్వూ వాళ్లని వెక్కిరించుకోవోయ్'' అని వాళ్లు అంటే, ''నాకేం మీలాగ బుద్ధిలేదా? ఎవరి మతాన్నిబట్టి వాళ్లు దేవుడిని ప్రార్థించుకుంటారు. అందుకు ఏడిపించటం ఎందుకు? నేను వాళ్లనీ అనటంలేదు — నన్నూ అనవద్దని చెప్తున్నానంతే! ఇంకోసారి నన్నలా వెక్కిరిస్తే వూరుకోను, జాగర్త!'' అని జవాబిచ్చాడు మొదట్లో. అంతటితో ఆగక తన పిలకపట్టుకు లాగేరని ఇద్దరు ముగ్గురు అబ్బాయిల్ని నిజంగానే చావబాదటంతో అందుకు భయపడేనా జానకి రామయ్య జోలికి రావటం మానుకున్నారు వాళ్ళు. తనచదువూ, వ్యాపకాలూ తనవిగా మెసిలే జానకి రామయ్యకి వాళ్లు తనతో మాట్లాడక పోయినా ఏ బాధా వుండేదికాదు.

మధుర మాత్రం జానకిరామయ్యతో బాగా మాట్లాడేది. తనయింటి దగ్గర్లోనే వుంటూ, తనక్లాసే చదువుతున్న ఆపిల్ల అందమైన, అమాయకమైన మొహం, కళ్లూ జానకిరామయ్యని ఆకర్షించాయి. అందుకే అతనూ ఆమెతో మాట్లాడేవాడు. చక్కని బొమ్మలావుండే ఆపిల్లని తనక్లాసు పిల్లలు ఎందుకు ఏడిపిస్తుంటారో మాత్రం అతనికి తెలిసేదికాదు. ఆమె క్లాసులోకి వస్తుంటే అప్పటికే ఆపాటి పరిజ్ఞానం వున్న అబ్బాయిలు, ఈలలు వేసేవాళ్లు! 'వ్యాపారం బాగాసాగుతోందా?' అనేవాళ్ళు. ఆమె భరించలేని కోపం వచ్చినప్పుడు ఓసారి కళ్లనీళ్లు

పెట్టుకుని, జానకిరామయ్యని ఆశ్రయించింది,

"చూడు జానీ వాళ్ళు..."

"నాపేరు జానీకాదు. జానకిరామయ్య..." కఠినంగా అన్నాడు అతను.

"అదేలే! పూర్తి పేరుతో పిలవాలంటే కష్టం..."

"నాపేరు కత్తిరిస్తే నాకు కోపం!"

"సరే, చూడు జానకిరామయ్య..." అంటూ వాళ్ళమీద ఫిర్యాదు చేసింది.

"ఒరేయ్, మధుర నేమన్నా అన్నారంటే వూరుకోను." అంటూ బెదిరించాడు వాళ్ళని.

"ఏం, నీసొమ్మేం పోయింది?"

"ఏం పోయిందా? ఓసారి మేష్టారితో వెళ్ళి చెప్తే తెలుస్తుంది. మనలాగే చదువుకోవాలని వచ్చిన అమ్మాయిని ఎందుకు ఏడిపిస్తారు మీరు?"

"పోనీ, ఏడిపించం ముద్దుపెట్టుకుంటాం, రమ్మను."

మరు నిముషంలోనే ఆమాట అన్నవాడి చెవడ కదిలిపోయింది. అప్పటినుంచీ జానకిరామయ్య వుండగా మధురమీద మాటలదాడి తగ్గింది.

మధుర తల్లి అప్పుడప్పుడు జానకిరామయ్య యింటికి వస్తుండేది. ఆమెని ఎవరో 'రాజా'గారు వుంచుకున్నారనీ, ఆయన వయసులో వుండగానే అకాలంగా మరణించటంతో ఆమె అమాయకత్వం ఆసరాచేసుకుని ఆయన బంధువులు ఆమెకి దమ్మిడీ ఆస్తియివ్వకుండా వీధిపాలు చేసారనీ, తనకి రాజాగారిచ్చిన నగలపుణ్యమా అని, వాటితో నాలుగురాళ్ళు చేసుకుని, కూతురితో, రాజాగారు అంతకుముందే యిచ్చిన పెంకుటింట్లో గుట్టుగా గడుపుతోందనీ, అప్పుడప్పుడు తల్లిదండ్రులు చెప్పుకోగా జానకిరామయ్యకి తెలిసింది. 'అందుకా వాళ్ళు మధురని ఏడిపించేది! సానికూతురనా' అనుకున్నాడు సాలోచనగా.

## 3

సాయంత్రం వేళల్లో ఆవీధిలోని పిల్లలందరూ ఓచోటచేరి ఆడుకునేవారు చదువులోలాగే ఆటల్లోనూ అందరికీ మొదట వుండేవాడు జానకిరామయ్య. ఒకరోజు ఆటల్లో వుండగా, ఎలావచ్చిందో వచ్చింది ఆమాట:

"ఏరా, మధుర వాళ్ళమ్మ సానిట కదా?" అన్నాడో అబ్బాయి. తెలిసిన మిగతా పిల్లలు 'అవునవునం'టే, తెలీనివాళ్ళు 'అలాగా?' అన్నారు.

"అయితే మరి దాంతో మనం ఆడుకో కూడదు ఇహనించీ". అన్నాడా అబ్బాయి.

"ఏం? ఎందుకని?" అడిగాడు జానకి రామయ్య.

"ఎందుకంటే... చెప్పానుగా — అది సానికూతురు."

"అయితే? ఆటలకీ, దానికీ ఏమిటి సంబంధం? అది వాళ్ళకులం. అంతే!"

"అందుకే, ఆకులం వాళ్ళతో మనం ఆడ కూడదు."

"అయితే, మీనాన్న మంగలి. వాడి నాన్న వడ్డంగి. మీతో నేనూ ఆడకూడదా?" ఆమాటల్తో రోషం వచ్చింది వాళ్ళకి.

"మీ నాన్న? మీ నాన్న యిప్పుడు గుమాస్తా అయినా, మీ బ్రాహ్మలు ఇదివరకు మంత్రాలు చదివేవాళ్ళు. అదేం గొప్ప? అందరి దగ్గరా బియ్యం, డబ్బులు అడుక్కునేవాళ్ళు..." భయపడుతూనే అన్నాడు ఆ అబ్బాయి. అయితే, అతనూ, మిగతా పిల్లలూ వూహించినట్టు జానికిరామయ్య తిరగబడలేదు. శాంతంగా జవాబిచ్చేడు:

"నిజమే. అప్పుడు అది మా వృత్తి. అందులో గొప్పవుందని నేనూ అనట్లేదు. అందులో గొప్ప ఎలా లేదో, మిగతా కులాల్లోనూ తక్కువలేదు. ఎవరికులం వాళ్ళది. ఎవరికి వాళ్ళేగొప్ప. మనం ఆడుకునేందుకూ, కలిసి చదువుకునేందుకూ కులాలు అడ్డురావు మీకిష్టమయితే ఆడండి. ఇష్టంలేనివాళ్ళు పోండి. ఇక్కడినించి వెళ్ళిపోయినా, రేపు బళ్ళోకి రారా? అక్కడమాత్రం కలిసి చదువుకోరా?"

వాళ్ళకి జవాబేం చెప్పాలో తోచలేదు.

"సరే, పోరింద్రా, ఎందుకొచ్చినగొడవ" అంటూ మళ్ళా ఆటలకి పడ్డారు. అప్పటిదాకా బిక్కమొహం వేసుకుని వాళ్ళవాదాలు వింటున్న మధుర మొహం ఆ మాటలకి వికసించింది.

'మా జానకిరామయ్య మంచివాడు' అనుకుంది. కృతజ్ఞతని మాటల్లోపెట్టటం చేతకాక అతని దగ్గరగావచ్చి చెయ్యిపట్టుకుని, "ఇవాళ్టినించీ నువ్వూ నేనూ ఒకే జట్టు" అంది.

## 4

యస్. ఎల్. సి కి వచ్చేదాకా ఆజట్టు జట్టుగానే సాగింది. గత ఏడాదిగా ఆ వీధిలో ఆటలు తగ్గిపోయాయి. పెద్దమనిషయిందన్న నెపంతో ఆమెతల్లి మధురని ఆటలకి పంపటం మానుకుంది. స్కూల్లో కలుసుకోవటమూ, సాయంత్రాలు ఎప్పుడన్నావచ్చి తెలీని పాఠాలు చెప్పించుకోవడమూ చేస్తుండేది మధుర. ఆ విధంగా వాళ్ళజట్టు సాగుతుండేది. 'అదే మాష్టారు, బళ్ళోచెప్పే అదే పాఠం తనకి అర్థంకాకపోగా, ఇతనికింత చక్కగా ఎలా అర్థమౌతాయో' అని ఆశ్చర్యపోతుండేది మధుర. జానకిరామయ్య పాఠాలు చెప్తుంటే మృదువైన గాత్రంతో అతను వివరించే తీరు, మెరుగ్గా మెరిసే అతనికళ్ళు, అందమైన అతని విగ్రహం ఆమెని మరింత ఆకర్షించేవి చెప్పేది వింటూనే, ఆలోచనల్లోకి, కలల్లోకి జారిపోయేది.

బొమ్మలా కళ్ళప్పగించి కూర్చున్న మధురని చూస్తే జానకిరామయ్యకి ఒకోసారి చిరాకు పుట్టేది.

"ఏయ్ మొద్దూ — వింటున్నావా?" అంటూ హెచ్చరించాడు ఒకసారి. ఆమెనించి జవాబు లేదు.

"మాట్లాడవేం?" అంటూ ఆమె భుజం మీద చెయ్యివేసి గట్టిగా కుదిపాడు

"ఉం..." అంటూ ఉలిక్కిపడి లోకంలోకి వచ్చిన మధుర, తన భుజంమీద అతనిచెయ్యి వుండటంతో, కలల్లోనికోరికేదో వాస్తవంలోకి వచ్చినట్లనిపించి, తనచేతిని ఆ చేతిమీదవేసి భుజానికి అదుముకుంది.

"చెప్పేదివినకుండా ఏమిటా పరధ్యానం? అందుకే స్కూల్లోనూ పాఠాలు అర్థం కావటం లేదు." అంటూ తనచేతిని లాగేసుకున్నాడు జానకిరామయ్య. అతనికి ఆమె కళ్ళలోని 'కల' వరం ఏదో అర్థమైనట్లే అనిపించింది. మొదటి సారిగా స్పృశించిన కుడిచేతిని ఓరగా ఓసారి చూసుకున్నాడు.

## 5

మధుర, జానకిరామయ్య ఒకే కాలేజీలో చేరారు. అయితే, హైస్కూల్కి, కాలేజీకి వాతావరణంలో వుండే తేడా మూలంగా వాళ్ళు హైస్కూల్లో మెసిలినంత స్వేచ్ఛగా కాలేజీలో మెలగలేక పోయేవాళ్ళు. తరుచుగా మధుర మాత్రం జానకిరామయ్య వాళ్ళయింటికి వస్తూనే వుంది. ఇద్దరూ కూర్చుని చదువుగురించో, కాలేజీ విశేషాలగురించో గంటా, రెండుగంటలు కబుర్లు చెప్పుకునేవాళ్ళు.

ఆ జట్టు ఆట్టేకాలం నిలవలేదు. డిగ్రీ సెకండియర్ పూర్తవుతుండగా జానకిరామయ్య తండ్రికి ట్రాన్స్ఫర్ వచ్చింది. అంతకుముందు



చాలాసార్లు ట్రాన్స్ఫర్ వచ్చినా, పక్కపక్కని వూళ్ళే కావటాన, ఆయన కుటుంబాన్ని కదల్చకుండా తనే రోజూ అక్కడికి వెళ్ళివస్తూ, ఏడాదో కాగానే తిరిగి అదేవూరికి మార్పించుకుంటూ వుండేవాడు. ఈ సారిమాత్రం మరీ దూర ప్రాంతానికి మారవలసి రావటంతో కుటుంబమంతా ఊరుమారక తప్పలేదు.

మరో నాలుగు రోజుల్లో వాళ్ళు వెళ్ళిపోతారనగా, ఆరోజు సాయంత్రం వాళ్ళింటికి వచ్చింది మధుర కాసేపు కూర్చున్నాక,

"నీతో కాసేపు ఏకాంతంగా మాట్లాడాలి" అంది ఇద్దరూ మేడమీదకి వెళ్ళారు పిట్టగోడ దగ్గర నిలబడ్డాడు జానకిరామయ్య. అతనికి దగ్గర్లో నిలబడింది ఆమె

"అయితే వెళ్ళిపోతున్నావా ?" కాసేపటి నిశ్శబ్దం తర్వాత అంది.

"ఊఁ ..."

"... .  "

"నాకూ చాలా బాధగా వుంది మధురా! దాదాపు పదేళ్ల స్నేహం దూరం అవుతోందంటే.. ."

". ... ..."

పది, పదిహేను నిమిషాలు ఏ మాటలూ లేకుండా అలాగే బొమ్మల్లా వుండిపోయారు వాళ్ళు

కనుచీకటి పడుతోంది. దూరంగా పొలాలు చీకటి తెరలు దించుకుంటూ కనిపిస్తున్నాయి పొలాల అవతల రైలుపట్టాలమీదుగా చప్పుడు చేసుకుంటూ రైలుబండి వెళ్తోంది. హఠాత్తుగా అంది మధుర,

"మన స్నేహం దూరం కావల్సిందేనా జానకిరాం ?"

"మరో అయిదారేళ్లపాటు మనం దూరంగా గడిపాక కూడా మనమధ్య స్నేహం దూరమైందన్న బాధ మిగులుతుందంటావా ?" నెమ్మదిగా అన్నాడు జానకిరామయ్య

# రేపటి నిర్ణయం

"నీది రాతిగుండె జానకిరాం !" అని మాత్రం అందామె. ఆ కంఠంలో సుడులు తిరుగుతున్న బాధ ఆ మూడు పదాల్లోనూ స్పష్టంగా బయట పడింది. ఆమె కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి అతని మనసులో సంప్రదాయానికీ, అనురాగానికీ ఘర్షణ జరిగింది.

ఒకరి మనసు ఒకరికి తెలుసు కానీ సూటిగా బయటపడే సాహసం యిద్దరూ చేయటంలేదు కాసేపటికి మధురే అంది :

"దూరమై ప్రయోగాలు చేయటంకన్న, దగ్గరయే అవకాశం గురించి ఆలోచించలేవా ?"

ఇక తప్పలేదతనికి. తన మనసులోని మాటల్ని స్పష్టంగా చెప్పాడు.

"అవకాశంలేదు మధురా. నీకు తెలుసు - మన కులాలు ఒకటి కాదు. కులాలు ఒకటి కాని వాళ్ళు ఎందరో యీ రోజుల్లో ఒకటౌతూనే వున్నారు. అది నాకు యిష్టంలేదు. నన్ను నువ్వు ఛాదస్తుడిగా అనుకోవచ్చు. కానీ అది నాకు వారసత్వంగా వచ్చిన ఆస్తి. ఆ అస్తిత్వాన్ని నేను పోగొట్టుకోదల్చుకోలేదు.

మునుపటివాళ్ళకన్న మన తరం ఎంతో ముందుంది అనుకుంటున్నాం అది నిజం కాదు మనమూ దేవుడిని నమ్ముతున్నాం. రామాయణ, భారతాల్ని పారాయణ చేస్తున్నాం. యుగాల కిందట వెలసిన వెంకటేశ్వరుని సన్నిధికి నిత్యం వేలమంది ప్రయాణాలు కడుతున్నారు. పేటక్ గుడి, యింటికో విగ్రహంగా దేవుడిని ఆరాధిస్తూనే వున్నాం ఎన్ని కబుర్లు చెప్పే యువకుడయినా పరీక్షవాడు దేవుడిని తల్చుకోకుండా వుంటున్నాడా ?

మరి దేవుడిని నమ్మి, వేదాల్ని నమ్మి జన్మలన్నిటిలోకీ మానవజన్మ, అందులోనూ బ్రాహ్మణజన్మ గొప్పదన్న వాదాన్ని ఎందుకు తిరస్కరించాలి ? ఈ రోజుల్లో జరుగుతున్న కులాంతర వివాహాల్లో అధికశాతం ముందంజ బ్రాహ్మణులదే! ఎందుకు ? మిగతాకులానికి వున్నంత పట్టింపు బ్రాహ్మలకి లేకపోవటంవల్లనే! మిగతాకులాలు చెప్పుకున్నంత గర్వంగా 'మేం బ్రాహ్మలం' అని చెప్పుకోరేం ? కులాన్ని మర్చిపోవటం, పూజల్ని నిర్లక్ష్యం చేయటం ఘనతగా భావిస్తారేం ?

పిరికితనం మొదటనించీ బ్రాహ్మలు పిరికివాళ్లనే అపవాదువుంది. అదే పిరికితనం యివాళ తమ కులాన్ని గురించి మనసులో గర్వించినా, బయటకు చెప్పుకోవటానికి అడ్డొస్తోంది

ఆ పిరికితనం నాకిష్టంలేదు నేను బ్రాహ్మణుడిని. కులం చెడటం నాకిష్టంలేదు.

స్నేహాలు చేయటానికి, ఒకరికొకరు సహాయపడటానికి, సహజీవనం గడపటానికీ కులాలు మతాలు అడ్డురావు. రానక్కర్లేదు. అలా వస్తే అది సంకుచితత్వం అనిపించుకుంటుంది అంతేగానీ, భిన్నకులాలకి చెందిన యిద్దరు వ్యక్తులు– కేవలం యిద్దరు వ్యక్తులు – పెళ్ళి చేసుకున్నంత మాత్రాన, ఆ రెండు కులాలమధ్య సంపూర్ణ బాంధవ్యం నెలకొనదు. కులవ్యవస్థ మాసిపోదు. అంతమాత్రానికే దేశానికి ప్రగతిరాదు.

వర్ణాంతర వివాహాలవల్లే కులవ్యవస్థ మాసిపోతుందనటం సరికాదు. మిగతా అన్నివిధాలుగానూ కులవ్యవస్థ అంతమయినప్పుడు, మనుషులంతా ఒకేకులం అయినప్పుడు, ఇహ వర్ణాలే మిగలవు. వర్ణాంతర అనేపదం అప్పుడు అవసరమేలేకుండా పోతుంది అంతేగాని, భిన్నవర్ణాలకి పెళ్ళిళ్ళు చేసేసి, ఏదో కొంత ముట్టచెప్పి, పేపర్లలో ఫొటోలద్వారా ప్రగతిని సాధించామని చెప్పుకుని, మళ్లీ స్కూల్లో, కాలేజిలో చేరాలని వచ్చిన ప్రతి విద్యార్థినీ, ఉద్యోగంకోసం వచ్చిన ప్రతియువకుడినీ కులం చెప్పుకోమని నిర్బంధించే విధానం అమలులో వున్నంతకాలం మనం ఏనాటికీ కులాలని విస్మరించలేము ఆ విస్మరణ లేనంత కాలమూ నేమా, నాలాటివాళ్లు కులగౌరవంకోసం తపిస్తూనే వుంటాము. దానికోసం ఏదైనా పణంగా పెడతాము

నాఅభిప్రాయం అర్థమయిందనుకుంటాను."

అయిదు నిముషాలసేపు అవిరామంగా మాట్లాడినా అతడి మాటల్లో ఆవేశం, వేగంలేవు. నిదానంగా ఆలోచనగా మాట్లాడాడు

మధుర కళ్లవెంట నీళ్లు ధారాపాతంగా కారాయి.

"పోనీలే జానకిరాం, యిన్నాళ్లూ యీ కులం తక్కువదాన్ని స్నేహపూర్వకంగా ఆదరించావు. అంతేచాలు ..." అంది. ఆమె మాటల్లోని నిష్ఠూరానికి జానకిరామయ్య చలించాడు ఆమె భుజంమీద చెయ్యివేసి, లాలనగా అన్నాడు,

"క్షమించు మధురా ! ఆ విధంగా ఎప్పుడూ అనొద్దు. నీది తక్కువ కులం అని నేననటంలేదు. ఎవరికులం వారికి జన్మతః ఏర్పడ్డాయి. అన్ని కులాలనీ సమంగా గౌరవించే సంస్కారం నాకు లేకపోతే,నేను నీతో స్నేహం చేసేవాడినా ? కులాలని బట్టి మనుషుల్ని గౌరవించేతత్వం నాకులేదు. అయితే జీవితాలు కలుపుకోవాలన్నావు కాబట్టి



# రోజంతా కష్టించినతర్వాత...





## ఆ ముఖకాంతిని మళ్ళా తెచ్చుకునే తీరు

పగటిపూట అలా వాడిపోయిన మీ చర్మానికి మళ్ళా ఆ కాంతిని ప్రతి రాత్రీ తిరిగి సమకూరుస్తుంది—పాండ్స్ లెమన్ కోల్డ్ క్రీమ్. అందాన్నిచ్చే నూనెలు, చర్మంలోగల తేమ, సరిగ్గా సరియైన పాళ్ళలో ఉన్నాయి దీన్లో...మీ చర్మాన్ని సుతిమెత్తగా, మృదువుగా, అందంగా అట్టేబెడుతుంది... మృదుత్వాన్నిచ్చే నిమ్మలోని ఆ తాజాదనాన్ని యిస్తుంది.




# పాండ్స్ లెమన్ కోల్డ్ క్రీమ్

**రోజంతా వాడిపోయిన మీ చర్మానికి మళ్ళా ఆ మృదుత్వం.**

లింటాస్-CPC. LC. 3-2315 TL



# రేపటి నిర్ణయం

నా అభిప్రాయం నిష్కర్షగా నీకు వివరించక తప్పలేదు ''

'పోనీ జానకిరాం, పై జన్మలోనయినా మనిద్దరం ఒకే కులంలో – అది ఏ కులమయినా సరే–పుట్టి, బ్రతుకు పంచుకోవాలని ఆదేవుడిని ప్రార్థిస్తాను '' అంది మధుర ఆమె గొంతులో వింత కంపన! మరి నాలుగురోజులకే వాళ్ళ వూళ్ళు వేరై పోయాయి

ఆ తరవాతినెల మొదటివారంలో, కొన్ని సర్దుబాట్లు చేసుకోవాలని ఆ వూరికి వెళ్ళిన తండ్రి మోసుకొచ్చిన కబురు జానకిరామయ్యని నిశ్చేష్టుణ్ణి చేసింది మధుర నీళ్ళు తోడబోతూ కాలుజారి నూతిలోపడి మరణించిందిట! ఆమె కాలు ఎందుకు జార్చుకుందో వూహించ గలిగిన జానకిరామయ్య మనసు ఎవరో కొలిమిలో పెట్టి కాల్చినట్లయింది

'పోనీ జానకిరాం! పై జన్మలోనైనా మనిద్దరం ఒకేకులం ' అన్న మధుర మాటలు చాలా రోజులదాకా అతని చెవుల్లో ప్రకంపిస్తూ వుండి పోయాయి!

## 6

సూర్యనారాయణ యూనివర్సిటీ పరీక్షల ఫలితాలు వచ్చాయి అతడికి యూనివర్సిటీ రాంక్ రావటం అతడికన్నా, జానకిరామయ్యగారినే ఎక్కువ సంతోష పరిచింది సూర్యనారాయణ సంతోషంగానేవున్నా, అతని ముఖంలో నీలినీడలూ మెదిలాయి

''ఏరా, ఎందుకు ఏవో బాధపడుతున్నావ్?'' అంటూ ఆప్యాయంగా అడిగారాయన

''ఇంక మీకు దూరమై పోక తప్పదునాన్నా''

''ఉద్యోగరీత్యా నువ్వుదూరంగా వెళ్ళినా, మనసులో వుంటావు కదురా! పాతికేళ్ళుగా స్థిరపడ్డ వూరిని విడిచిరాలేకగానీ, రేపు కాలూ, చెయ్యీ ఆడని పరిస్థితివస్తే నువ్వేకదూ నాకు దిక్కు?'' నవ్వుతూ అన్నారాయన ఎందుకో సూర్యనారాయణ కళ్ళలో నీళ్ళు నిండాయి

రిజల్టు వచ్చిన అయిదు నెలల్లోనే సూర్యనారాయణకి గవర్నమెంట్‌లో ఉద్యోగం వచ్చింది తండ్రిని విడిచివెళ్తూ, ఎన్నడూ లేనిది – సూర్యనారాయణ తండ్రికి పాదాభివందనం చేశాడు!

## 7

సూర్యనారాయణ ఉద్యోగమై వెళ్ళిపోయిన తర్వాత, సుమారు మూడు నెలలకి అతడు రాసిన ఓ ఉత్తరం జానకిరామయ్యగారిని తల్లక్రిందులు చేసింది

పూజ్యులయిన నాన్నగారికి,

ఈ ఉత్తరం మిమ్మల్ని బాగా దెబ్బతీస్తుందని తెలుసు కానీ, తప్పనిసరి పరిస్థితుల్లో మీకిది రాస్తున్నాను

నన్ను చిన్నప్పటినుంచీ గారాబంగా, తగినంత స్వేచ్ఛ యిచ్చి పెంచినందుకు ముందుగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను ఎందుకంటే మీరిచ్చిన ఆ స్వేచ్ఛ, స్వంత ఆలోచనా దృక్పథాలే ఈనాటి నా మనస్థైర్యానికి మూలం

మీ మనసు, మీ పట్టుదల, మీ ఆచార వ్యవహారాలు, మీ కట్టుబాట్లు నాకు బాగా తెలుసు కనుక, మీముందు నిలబడి, మీతో వాదించి, మిమ్మల్ని ఒప్పించలేననీ నాకు తెలుసు అందుకే, ఇలా నా నిర్ణయం పరోక్షంగా మీకు తెలియ జేస్తున్నాను

ఒక్క కులం తప్ప, గుణగణాలు, రూపురేఖలు అన్నిటిలోనూ మీకు అభిమాన పాత్రం కాగల ఓ అమ్మాయితో నేను మనసు కలుపుకుని ఏడాది దాటింది ఆమె యూనివర్సిటీలో నా మనసుకు దగ్గరయింది అయితే, మీరు హర్షించరని స్పష్టంగా తెలుసు గనకే ఆమెని మీకు పరిచయం చెయ్యలేదు

నిన్ననే రిజిస్ట్రార్ ఆఫీసులో యిద్దరం దంపతులమయ్యాం మీకై మీరు మనసుకి సర్దిచెప్పుకోగలిగి, మమ్మల్ని మనస్ఫూర్తిగా ఆహ్వానిస్తే తప్ప, నేనింక మన యింటికి వచ్చే సాహసం చెయ్యలేను

హృదయపూర్వక నమస్కారాంతో,
సూర్యనారాయణ

జానకిరామయ్యగారి మొద్దుబారిన మెదడు చాలాసేపటిదాకా స్వాధీనంలోకి రాలేదు అదే ఉత్తరాన్ని పదే, పదే చదువుతూనే వున్నారు

'ఎదిగొచ్చిన కొడుకు చిత్తం చెప్పినట్టు నడుచుకున్నాడు ఇప్పుడిక తన నిర్ణయం ఏది కావాలి? కొడుకుని అవునని ఆదరించాలా? కాదని దూరం చేసుకోవాలా?

ఈనాడు మధుర బ్రతికి వున్నట్టయితే ఏమనేది?

కొడుకుని చేరదీస్తే – 'వయసుడిగిన వాడు నిన్ను ఆదుకోవాలి కదా! నన్ను తిరస్కరించినంత తేలిగ్గా కొడుకునెలా తిరస్కరిస్తావ్‌లే!' అని అపహసిస్తుందా?

అలాగని తిరస్కరిస్తే, 'నన్నెలాగూ దూరం చేసుకున్నావ్ మరో తరం మారిన యీనాడైనా, కనీసం కోడలినైనా ఆదరించ'మని సలహా యిస్తుందా?

ఏ కారణంగా అయితే మధుర జీవితాన్ని బలితీసుకున్నాడో, అదే కారణంగా దూరమయిన కొడుకుని ఆదరించి, చేరదీసే అధికారం తనకుందా?'

ఆలోచన తెగటంలేదు జానకిరామయ్యగారికి అలాగే కూర్చుండిపోయారు స్థాణువులా పొద్దువాటారినా చీకట్లు ముసురుకున్నా!

రేపయినా తెల్లవారకపోదు ఆ వెలుగు వచ్చాక అయినా ఆయన ఓ నిర్ణయం తీసుకోక తప్పదు!

# వారఫలం

## 9-5-1980 శుక్రవారం మొదలు 15-5-1980 గురువారం వరకు

**మేషం** ఉత్తమ వారఫలం మీకు సంభవమని గ్రహించాలి. వ్యాపారం ఏలాటి ఒడిదుడుకులు లేకుండా జరుగగలదు. పత్రిక ప్రకటన, గ్రంథ కర్తృత్వం, కళారంగ ఖ్యాతి వృద్ధి పొంద గలదు. చిత్ర రంగంలో, క్రీడారంగంలో అనుభవంగల వారికి అవకాశాలున్నాయి. స్త్రీలకు అన్ని రంగాల్లో మంచి అవకాశాలుండుటే గాక, ద్రవ్యాదాయం సంభవం.

**వృషభం :** వ్యవసాయరంగంలో మీరుకొత్త మార్పులు చేయనున్నారు. క్రీడారంగంలో మీకు అనేకావకాశాలుండ బోతాయి. కొందరకు విదేశ ప్రయాణానుకూలత గల గ్రహస్థితి గలదని గ్రహించాలి. మిత్ర సందర్శన, బంధువులమూలాన అభివృద్ధి,మీ వృత్తి ఉద్యోగాలలో సమకూడగలదు, స్త్రీలకు: గృహ కార్యభారం, బంధువులను ఆదరించటంతో,ఉద్యోగానుకూలతతోవారంగడుస్తుంది.

**మిధునం** రాశికి సమాగింట గల గ్రహాలు అనుకూలత కూర్చినను, ద్రవ్యాదాయం సమకూర్చినను, మానసిక శాంతికి మాత్రం లోపం గలుగజేయు నున్నవి దీర్ఘ వ్యాధులు గలవారు చాల జాగ్రత్త పడాలి. భూసమస్యా పరిష్కార మార్గముంటుంది స్త్రీలకు. ఆట పాటల్లో జోక్యం గలవారికి అవకాశాలు దొరుకుట, ఆరోగ్య లోపం లేక పోవుట, వృత్తిలో అభివృద్ధి కల్గుట వారఫలం.

**కర్కాటకం :** మీరు రచయితలయితే, క్రొత్త అవకాశాలుంటాయి 'అగ్రిమెంట్లు' చేయగల వారు, వ్యవహారాలు పరిష్కరింప దలచుకొనేవారు, చిత్ర రంగానుభవం గల వారు, ఇంకా కొంత కాలం ఆగితేనే మంచిది. మీ వృత్తిలో, ఉద్యోగంలో పెద్దగా చెప్పదగిన మార్పులుండవు. ఆదాయం ఆశింప అనుకూల వారం గాదు మీ తాలూకు వస్తువులు పొయ్యే అవకాశమున్నది జాగ్రత్త! స్త్రీలకు: ఉద్యోగలాభం, ద్రవ్యాదాయంగలవారం.

**సింహం** చిక్కిన అవకాశాలు జారిపోకుండా చూచుకోండి చాలమందికి దైవ కార్యాలు నెరవేర గలవు. ఆధ్యాత్మిక చింతన హెచ్చుతుంది భూములు కొనుటయో, అభివృద్ధి చేయుటయోసంభవం. బంధువులు ఇల్లు చేరగలరు స్త్రీలకు కార్యభారం అధికం కావటం, ఉద్యోగంలో ప్రమోషన్, అప్రయత్న ద్రవ్యలాభం వారఫలం

**కన్య** ఏ మాత్రం అశ్రద్ధ చేసినా ఉద్యోగంలో ఇబ్బంది పడగలరు. మీ వృత్తిలో అనుకూలత గలదు మీకు చిత్రరంగానుభవ ముంటే, నూతనావకాశాలుండ గలవు. మీరు గాయకులైతే, క్రొత్తగా కొన్ని అవకాశాలుంటాయి. గృహ సంబంధమైన చిక్కులు నివృత్తి కాగలవు స్త్రీలకు ద్రవ్యాదాయం గలదు సుఖ శాంతులున్నాయి. ఆరోగ్య లోపం లేదు

**తుల** భూముల మూలాన, వ్యాపార మూలాన మీకు ఆర్జన గలదు. మీ మంచితనం వలన, చాకచక్యంవలన, మాట నేర్పరితనం వలన అనేక విధాల లాభం పొందనున్నారు. ఏ కార్యంలోనైనా లాభదాయకమే ఉద్యోగంలో అభివృద్ధిని సూచించే వారం స్త్రీలకు బంధువుల మూలాన లాభం, విలాస వస్తు సేకరణ, ఉద్యోగవృత్తులు లాభదాయకం కాగలవు.

**వృశ్చికం** గ్రహాల మూలాన లాభమున్నది. ఏవో విలువగల వస్తువులు సేకరించగలరు. పోయిన వస్తువులు సేకరింప బడుతాయి బంధుమిత్రుల, అధికారుల ఆదరణ లభింప గలదు. ద్రవ్యాదాయం గలదు. పాత బాకీలంటే వసూలు కాగలవు.మిత్రులతో సంఘర్షణ ఉండగలదు. శాంతంగా ఉండటం మంచిదేగా! స్త్రీలకు దూర బంధువులు ఇబ్బందులలో ఉన్నట్లు వినగలరు. ఆదాయం సామాన్యం. ఉద్యోగ వృత్తులు బాగుంటాయి.

**ధనుస్సు** మీ వ్యాపారం బాగా సాగుతుంది. అధికారుల మూలాన, జాయింటు వ్యాపారస్తులవలన అశాంతి చేకూర గల పరిస్థితులుండ గలవు. భూములు సంపాదించాలనే ప్రయత్నముంటుంది. గృహ విస్తరణ కార్యక్రమంలో నిమగ్నులు కాగలరు. స్త్రీలకు: ఆదాయం, ఆదరణ, అనుకూలత, ఆట పాటల్లో అమూల్యమైన అవకాశాలుండ గలవు.

**మకరం** మీ రాశికి అష్టమ రాశిలో గల గ్రహాలు , మీ కార్యక్రమాలకు అంతరాయం కలుగజేయ నున్నవి. మీ ఆరోగ్యంలో లోపం రావచ్చు ఆహార విహారాదులలో ఎంతైనా జాగ్రత్త వహించాలి. ముఖ్య బంధువుల దగ్గర నుండికొన్ని ముఖ్య వార్తలంద గలవు ప్రయాణం సంభవం కాగలదు. స్త్రీలకు ద్రవ్యానుకూలత, ఉద్యోగంలో అభివృద్ధి, వృత్తిలో పెంపుకు దోహదం చేయగల గ్రహస్థితి గలవారం.

**కుంభం** నష్టాధిక్యత వలన, రాశిలో స్థితుడైన 'కేతు' గ్రహం మూలాన, శారీరకంగా బాగుండదు. వ్యాపారంలో ఇబ్బందులుండ గలవు. మిత్రులతో, ఇరుగు పొరుగు వారితో ఘర్షణలుండ గలవు స్త్రీలకు మానసికంగా అశాంతి ఉండగలదు. సుఖ సంతోషాలకు లోపం, అధిక వ్యయం గలవారం

**మీనం** క్రీడారంగంలో చాలమందికి అనుకూలం వ్యాపారం బాగా లాభదాయకం. అధికారుల బెడద లేకుండా చూచుకోవటం కూడా ముఖ్యమే ఆదాయాన్ని మించిన వ్యయముంటుంది స్త్రీలకు ఉద్యోగ వృత్తులలో నూతనావకాశాలుండ గలవు. ద్రవ్యాదాయం గల వారం. ఆరోగ్య లోపంలేదు.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. -సం.

# వంటలు

## ముల్లంగి ఆవకాయ

కావలసినవి : ముల్లంగి దుంపలు —అర కేజీ, లవంగాలు — ఒక స్పూన్, ఏలకులు — ఒక తులం, గసగసాలు - చారెడు, ఆవాలు - 50 గ్రా, నూనె- 200 గ్రా, పసుపుగుండ—2 స్పూన్లు, ఉప్పు తగినంత.

విధానం : ముల్లంగి దుంపలను ముక్కలుగా కోసి, శుభ్రంగా కడగాలి. నీళ్లల్లో చిటికెడు ఉప్పువేసి ఉడికించాలి. ఆ తర్వాత ముక్కల్ని వార్చి, తడి ఇగిరిపోయేవరకూ ఆరబెట్టాలి. లవంగాలు, ఏలకులు, గసగసాలు, ఆవాలగుండ ముల్లంగి ముక్కలతో పాటు వేయించాలి. చివరన పసుపు గుండ వేస్తే మంచి రంగు వస్తుంది. ఆ తర్వాత రెండు రోజులు ఎండలో వుంచితే మంచి రుచిగా తయారౌతుంది. ఇది ఎక్కువ కాలం నిల్వ ఉండదు.

## బంగిజో తొర్కార్

కావలసినవి :— వంకాయలు అర కేజీ, ఎండుమిర్చి పొడి 50 గ్రా., ధనియాల పొడి 50 గ్రా., ఉల్లి తరుగు కొబ్బరి తురుము, కొంచెం పచ్చిమిర్చి, అల్లం 10 గ్రా., నూనె 200 గ్రా., నువ్వుల పప్పు పొడి 50 గ్రా., ఉప్పు తగినంత, చింతపండు కొంచెం, కరివేపాకు, కొత్తిమీర ఒక్క కట్ట, వెల్లుల్లి కొంచెం.

తయారుచేయు విధానం :— వంకాయలు కడిగి నాలుగు చీలికలుగా కోసుకుని, ఉప్పు నీళ్ళల్లో వేసి ఉంచుకోవాలి. అల్లం, పచ్చిమిర్చి, జీలకర్ర, వెల్లుల్లి గుండ కొట్టాలి. ఉల్లి తరుగు, నువ్వుపప్పు పొడి, కొబ్బరి తురుము, ధనియాల పొడి, పసుపు పైన గుండకొట్టిన ముద్దతో పాటు బాగా కలుపుకొని వంకాయల్లో చీలికల మధ్య కూరుకోవాలి. చింతపండు నానబెట్టి సిద్ధంగా ఉంచుకోవాలి. కొత్తిమీర, కరివేపాకు ముద్ద చేసి వంకాయల్లో కూరాలి. తర్వాత వంకాయలను నూనెలో వేయించాలి. తర్వాత చింతపండు పులుసు వంకాయల పైన పిండుకుని, మూత పెట్టి పావుగంటసేపు ఉడకనిచ్చి దించుకోవాలి.

- ప్రభా మల్లిబాబు

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





## మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజ
సిద్ధమైన నాలుగు
నూనెల సమ్మేళనం—

హపుషా (దేవదారు జాతి), లవంగ పట్ట, లవంగ, సరళం. రెక్సోనాతో స్నానం చెయ్యండి—అది మీ చర్మాన్ని మృదువుగా మెరిసేలా ఉంచుతుంది. మీరెంతో ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై నిలిపి గుబాళింపజేసే రెక్సోనా, మీ చర్మ సంరక్షణ కోసం సహజమైన సాధనం.




## రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందూస్థాన్ లివర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-RX.76-2316 TL

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్‌బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# రైల్లో ఆడదొంగలు!

ఆంధ్రదేశం మీదుగా పోయే రైళ్లలో ఆడవారి పెట్టెలలో వుండి ఆడ ప్రయాణికుల సామానులు, పెట్టెలలో బట్టలు, నగలూ వగైరాలీ మధ్య విపరీతంగా పోతున్నాయట. ప్రయాణికుల రిపోర్టులను బట్టి ఒక వయసయినావిడ, వో వయస్సులో వున్నవిడా యీ దొంగతనాలుచేస్తున్నట్టనుమానం వచ్చిందట. అంతేగాక మద్రాసు నుంచి రాత్రివేళల బయలుదేరే ఎక్స్‌ప్రెస్ రైళ్లలో యీ దొంగతనాలు మరింత ఎక్కువగా జరుగుతున్నట్టు అనుమానాలతో, వాటి ఆధారాలతో ఆంధ్రప్రదేశ్ పోలీసు తమిళనాడు పోలీసు సహాయం కోరితే, తమిళనాడు పోలీసులు ఒ పథకంవేసి ఆ యిద్దరాడాళ్లనూ మొన్న మార్చి 30వ తేదీన అరెస్టు చేశారట. పెద్దావిడకు 55 ఏళ్ళూ. పేరు పుష్పట. చిన్నావిడ పేరు సరస్వతిట. 25 ఏళ్లట. వీరిద్దరూ తల్లీ కూతుళ్లట. మద్రాసు నుంచి బయలుదేరే రైళ్లలో ఆడవారి పెట్టెలలో ఎక్కి, క్రింద పక్క పరుచుకు పడుకుని, అంతా మంచినిద్రలో వుండగా ప్రయాణికుల పెట్టెలు తీసి తెరిచి, చేతికందినవి ఏరి, తాము తెచ్చుకున్న ఖాళీ పెట్టెలలో పెట్టేసుకుని ఆనక సరస్వతి తనకు కడుపునెప్పి వచ్చినట్టు నటించి, దగ్గర స్టేషనులో తల్లీ కూతుళ్ళు దిగిపోతారట. ఇది కథ. వీరిల్లు సోదాచేస్తే చిన్న నగల, బట్టల ఎగ్జిబిషనులా ఉన్నదట!

## పొగతాగితే చెవుడు!

పొగ్రతాగడం వల్ల ఆ నష్టముందనీ, యీ నష్టముందనీ అనేక విజ్ఞాన శాస్త్రాలు చెప్పాయి. అన్నీ చెప్పాక యిహ కొన్ని కొత్తరకం యిప్పుడు బయట పెడుతున్నాయి. పొగ త్రాగడంవల్ల చెవుడు వస్తుందనీ, శక్తి [స్టామినా] రానూనూ తగ్గుకుంటూ వస్తుందనీ యిపుడు విజ్ఞానశాస్త్రం వివరిస్తోందట.

## ఫిర్యాదుని ఉపసంహరించుకున్న ప్రేమలత!

ఆ నాడు ఎమర్జన్సీ ఉన్న రోజులలో కర్నూరి టాకూరు నన్ను నేపాల్ తీసుకువెళ్లి అక్కడ నా శీలాన్ని అపహరించారు ఆవటాని ఖాట్మండు లోని ఒక స్కూలులో టీచరుగా పని చేస్తున్న ప్రేమలత అనే అమ్మాయి కోర్టులో చేసిన ఫిర్యాదును ఉపసంహరించుకున్నదట. అదెట్లు— శీలాపహరణ జరగలేదనా, జరిగినా ఫర్లేదనా!!

## బియ్యందంచె భీముడు!

జపానులో నూతన సంవత్సరానికి బియ్యం పిండితో చేసిన కేకు తయారుచేసి, దాన్ని కోసి తిని ఆనందిస్తారట. టోక్యోలో మహాబలశాలి అయిన వ్యక్తి చాలా మంది ప్రేక్షకుల ముందు బియ్యం దంపుతాడట. ఆ పిండిలోనే కేకుతయారు చేస్తారట. ఈ పిండి దంపుడుకు బలశాలిని ఎన్నుకునే పోటీలు అంతకు ముందు జరుగుతాయట.



## అతిజాగ్రత్తలు!

ఫ్రెంచి జనాధిపతి ఎస్టాంగ్ మనదేశం చూడవచ్చి బొంబాయిలోని ఒ బరాయి హోటలులో దిగారట. అప్పుడో సందర్భంలో ఆయనకు ఒహరు మనదేశపు పెన్ను ఏదో సంతకం పెట్టడానికిచ్చేసరికి ఆయనంతరంగ కార్యదర్శి, రక్షకుడు ఆ పెన్ను ముట్టవీల్లేదని అన్నారట. ఆ పెన్నులో బాంబు ఉన్నదా అని అనుమాన నివృత్తికి వారే ఆ పెన్నుతీసుకుని పరిశీలించారట. అదే మాదిరిగా ఆయనకో దంతపుపెట్టె బహూకరిస్తే దాన్ని కూడా వాళ్ళు పీకిపాకంపెట్టి ఆనకే ఆయనను ముట్టుకోనిచ్చారట!

## నష్టపరిహారం

సేలం పొన్నమ్మపేటకు చెందిన కృష్ణమూర్తి అనే ఒ విద్యార్థిని 11—12—73న ఒ లారీ గుద్దిందట. శరీరమంతా హూనమై అతను వెల్లూరు ఆసుపత్రిలో చికిత్స పొంది మూడేళ్ళు దాటాక బయటపడ్డాడట. ఆ యాక్సిడెంటువల్ల కృష్ణమూర్తికి ఒకకాలు వంకరబోడమే గాక తుంటిదగ్గర వెన్నెముక విరిగిపోయిందట. దీనివల్ల అతను దాంపత్య జీవితాని కనర్హుడని, పెళ్లిచేసుకోడానికర్హత పోగొట్టుకున్నాడనీ డాక్టర్లు ప్రకటించారట. కృష్ణమూర్తి, అతనితరపు వారూ కలిసి లారీ సొంతదారుమీదా, ఇన్సూరెన్సు కంపెనీ మీదా దావావేస్తే కోర్టు 55 వేలు నష్టపరిహారం అతనికివ్వాలని తీర్పుయిచ్చిందట.

## అనరా నికి దారితీసిన ఆవేశం

వెళ్లాండివలసు [ఎడప్పాడి]లో 60 ఏళ్ల రంగసామి కొడుకు పాతికేళ్ల కందసామి పెండలంలా పెరిగి బాధ్యత పట్టించుకోకుండా వుండడమే గాక, డబ్బు దుబరాచేస్తూ అడిగితే తండ్రిని కూడా లక్ష్యపెట్టడం మానేశాడట. ఒరోజు [మార్చి 30న] రంగసామి కొడుకుని నిలేసేసరికి కందసామి తండ్రిని చితకబాదాడట. తన కొడుకు తనని కొట్టడంతో రంగసామికి గంగవెర్రులెత్తి కొడవలితో కొడుకుతల తెగేశాడట.

## అక్రమ సంబంధం [illegible]!

కవుండనూరుకు చెందిన గణపతి అనే ఒకతను, అదే వూరుకు చెందిన కాశి అనే ఒకమ్మాయి పరస్పరం ప్రేమించుకుని, కలిసి జీవించితీరాలనే నిర్ణయానికి వచ్చారట. ఆ నిర్ణయం ప్రకారం కాశి తన భర్తను, పిల్లాడిని వదిలేసి గణపతితో కాపురం ఆరంభించేసిందట. ఒ మూనెళ్ళు గడిచాక ఒకనాడు గణపతి ఎక్కణ్ణుంచో ఇంటికివస్తూ తన యింట్లోంచి ఎవరో ఒకతను బయటికి వెళ్లడంచూసి, ఎవడేవాడు అనడిగాడట. దాని కామె ఏ విధమైన సమాధానమూ యివ్వకపోయేసరికి సాచో లెంపకాయ కొట్టాడట. ఆ దెబ్బ నవరకణతకు తగిలి కాశి అక్కడికక్కడే చనిపోయిందట.

## రాష్ట్రపతి సంతోషం–సంజయ్ ఆశ్చర్యం!

జనవరి 14వ తేదీ ప్రమాణ స్వీకారాలు అవీ అయ్యాక రాష్ట్రపతి సంజీవరెడ్డి సంజయ్‌గాంధి ఎక్కడ అని అడిగి, సమాధానం కోసం ఎదురు చూడకుండా మూడోవరుసలో కూర్చునివున్న సంజయ్‌గాంధి వద్దకువెళ్లి ఎం. పి. గా ఎన్నికైనందుకాయనకు తన సంతోషాన్ని వ్యక్తం చేశారట. ఎదురు చూడని యీ సంతోష ప్రకటనకు సంజయ్‌గాంధి ఆశ్చర్యపోయారట. ●



## హైదరాబాద్ నోట్‌బుక్

### రీడరుపై దాడి ఫలితం:

ఉస్మానియా విశ్వవిద్యాలయం అడ్మినిస్ట్రేటివ్ శాఖ రీడరుగా పని చేస్తున్న డాక్టర్ ఉమాపతిని, ఆయన భార్యను మార్చి 31 తేదీన కొట్టినట్లు ఆరోపించిన నలుగురు విద్యార్థులను యూనివర్సిటీ సస్పెండు చేసింది. వారిలో ఒకరిని పోలీసులు అరెస్టు చేశారు. తక్కిన నిందితుల కోసమూ గాలిస్తున్నారు. డాక్టర్ ఉమాపతి చీఫ్ వార్డెను. కనుక ఆయనపై జరిగిన అత్యాచారానికి నిరసనగా 11 మంది హాస్టలు వార్డెనులు రాజీనామా చేశారు. ఉపాధ్యాయులు నిర్వహిస్తున్న పరీక్ష పనిని పరీక్షల కంట్రోలరుకు అప్పగించాలని ఉపాధ్యాయ సంఘం కార్యవర్గం తీర్మానించింది. విద్యార్థుల చర్య విద్యార్థులకు, ఉపాధ్యాయులకు మధ్య గల సంబంధాన్ని ధ్వంసం చేస్తుందని ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం కార్యదర్శి శ్రీ సుధీర్ ఖండించారు. ఇది ఇలా వుండగా విద్యార్థిని అరెస్టు చేసినందుకు నిరసనగా న్యాయ కళాశాల విద్యార్థులు పరీక్షను బహిష్కరించారు. పదవ తరగతి పరీక్షలో కాపీ కొట్టనివ్వనందుకు కొందరు విధ్వంసం చేసినట్లు మలక్ పేట జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ పీటర్ తెలిపారు. ఈ పేరంటా ఎందుకని ఇంటర్నల్ అసెస్మెంటు పద్ధతిని రద్దు చేయాలని ఉస్మానియా విశ్వవిద్యాలయం అకడెమిక్ కవున్సిల్ ఏప్రిల్ 11 వ తేదీన సిఫార్సు చేసింది.

### భిక్షుక గృహాలు :

రాష్ట్రంలో భిక్షావృత్తి శ్రీ జలగం వెంగళరావు పరిపాలనలోనే నిషేధించారు. కాని, నగరంలో ఎక్కడ చూచినా భిక్షుకులే కనిపిస్తారు. హోటళ్ల వద్ద, సినిమాల వద్ద, చౌరస్తాల వద్ద, రైలు స్టేషనుల వద్ద, దుకాణాల వద్ద, చారిత్రక ప్రదేశాల వద్ద. అమలు కాని చట్టం, ఫిక్సెడ్ డిపాజిట్లలో వున్న డబ్బు ఒక్కటే. భిక్షాటన నిషేధం అమలు పరచడానికి వీలుగా ఇప్పటి ప్రభుత్వం హైదరాబాద్, విజయవాడ, తిరుపతి నగరాలలో ప్రయోగాత్మకంగా చెరి ఒక భిక్షుక గృహాన్ని నిర్మించడానికి నిర్ణయించింది. వికలాంగులు, వృద్ధులు అయిన భిక్షుకులకు గృహాలలో వృత్తి శిక్షణ ఇస్తారు. దృఢగాత్రులయినా భిక్షాటనకు వృత్తి శిక్షణ పూనుకొనేవారిని అరెస్టు చేసి శిక్షిస్తారు. ఈ విషయాలను హరిజన సంక్షేమ, గృహనిర్మాణ శాఖామంత్రి శ్రీ కోనేరు రంగారావు ఏప్రిల్ 3న పత్రికా ప్రతినిధులకు తెలియజేశారు.

### ప్రిన్సిపాలుపై విద్యార్థుల దాడి :

నగరంలోని వివేకవర్ధనీ కళాశాల హైదరాబాద్ స్వాతంత్ర్యోద్యమ ఫలం. క్రమ శిక్షణకు, గురుశిష్య సత్సంబంధాలకు పేరు పొందిన సంస్థ. దానిలోనే విచిత్రమైన సంఘటన జరిగిందంటే, ఆశ్చర్యమే. ఈ సంఘటన ఏప్రిల్ 10న జరిగింది. వివేకవర్ధనీ కళాశాల విద్యార్థి సంఘం అధ్యక్షుడు శ్రీ అంజన్‌కుమార్ మరొక విద్యార్థితో ఇన్‌చార్జి ప్రిన్సిపాల్ శ్రీ కృష్ణమూర్తి గదిలో ప్రవేశించి, ఒక విద్యార్థి బస్సు పాసు కోసం ధ్రువీకరణ కోరారు. ఆ విద్యార్థి తమ కళాశాలవాడు అవునో కాదో పరిశీలించిన పిదప ధ్రువీకరిస్తానని ప్రిన్సిపాల్ తెలిపారు. దానిపై జరిగిన వాదోపవాదాలలో ఉద్రేకం పెరిగి శ్రీ అంజన్‌కుమార్, ఆయన సహచరుడు ప్రిన్సిపాలుపై దవుర్జన్యానికి పూనుకొన్నారు. ఇంతలో కళాశాల అంతటా గందరగోళం వ్యాపించింది. పోలీసుల జోక్యం అవసరమయింది. కళాశాల విద్యార్థి అవునో కాదో వెరిఫై చేయడానికి 10 నిమిషాలు పడుతుంది. అంతమాత్రం విద్యార్థులు ఓర్చుకో వచ్చు గదా! విద్యార్థి నాయకుల ఆత్మగౌరవానికి భంగమేమీ కాదుగదా!

### "చెత్త పత్రికలు":

పత్రికలంటే ఎందుకో మన నాయకులకందరికీ కోపం! నెహ్రూ అతంటి వారుకూడా

తనకు నచ్చని విమర్శలు వచ్చినప్పుడు పత్రికలపై విరుచుకొని పడేవారు. అయినా నెహ్రూ గొప్ప ప్రజాస్వామ్యవాది గనుక, ఎదుటివాడు చెప్పినది ప్రియం కాక పోయినా, వినేవాడు, మొదట తాటాకు మంటగా కోప్పడినా. ఆ వోపిక తర్వాత వారికి ఉండడం కష్టం! అప్రియ సత్యాన్ని వినడానికి, వినిమయనం చేసుకోడానికి, మననం చేసుకొని కళ్లు నిజము లరయడానికి ఎంతో మన: పరిపాకం కావాలి. అలాటి మన: పరిపాకం పూర్వ జన్మ సుకృతం అని అనవుగాని, అనుభవావృతం అనగలను. ఇంతకూ ఉన్నమాటంటే ఉండూరచ్చిరాదనే సామెత ఉండనే ఉంది. కనుక, మార్చి 27న రాష్ట్ర విధాన పరిషత్తులో ఆర్థిక మంత్రి శ్రీ రాజారాం చెత్త పత్రికలు ఏవేవో రాస్తూంటాయి అని అనడం, దానిపై ప్రతిపక్ష సభ్యులు ఘర్షణ పడడం విశేషమేమీకాదు. పత్రికల వాయి నొక్కడం, తమకు ఇష్టం లేని సంఘటనలను చరిత్ర నుంచే తొలగించడం మనం చూస్తూనే ఉన్నాము, వింటూనే ఉన్నాము.

**గ్రహణాలు – గర్భిణులు :**

గర్భిణులు గ్రహణాన్ని చూస్తే వికలాంగులు పుడతారనే భయం ప్రాచ్య దేశాల్లో చాల కాలంగా ఉంది. గ్రహణం గ్రహ రీతిలో మార్పుల వల్ల కలిగేదేగాని మరేమీ కాదని వరాహమిహిరుడు చెప్పినా, ఎంత గొంతు చించుకొని చెప్పినా, ఏవో పాములు మింగుతున్నాయని విశ్వసించడం, అలాటి గ్రహాలకు కలుగుతున్న బాధలను చూస్తే తమకూ హాని కలుగుతుందనే భావమూ వ్యాపించి విధి విధానాలకు కారణమయి ఉంటుంది. ఫిబ్రవరి నెలలో సంభవించిన సంపూర్ణ సూర్యగ్రహణ సమయంలో గ్రహణ ప్రభావాన్ని గురించి ప్రపంచ శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపారు. మన రాష్ట్ర రాజధానిలోను ఈ పరిశోధనలు జరిగాయి. ఈ పరిశోధనలు అనువంశిక వ్యాధుల వైద్యశాల [జెనెటిక్స్ ఇన్స్టిట్యూట్] లోను జరిగాయి. ఈ సంస్థలోని పరిశోధకులు డాక్టర్ ఎస్. బాలిరెడ్డి, డా. పి. పి. రెడ్డి నాయకత్వాన పరిశోధనలు జరిపారు. మానవుని రక్తాన్ని సంపూర్ణ సూర్య గ్రహణ సమయంలో సూర్య కిరణాలకు గురి అయ్యేట్లు చేసి, ప్రయోగాలలో పరిశీలించారు. రక్తకణాల పెరుగుదలలో గాని, కణాల ఆకారంలో గాని, క్రోమోజోముల నిర్మాణంలోగాని ఎలాంటి మార్పు లగలేదు. అలాగే కడుపులో ఉన్న ఎలుకలపై గూడ గ్రహణ కిరణ ప్రసారం పరిశీలించారు. పిదప ఈత తర్వాత కూడా పరిశీలించారు. పిల్లల సంఖ్యలోగాని, లైంగిక నిష్పత్తిలో గాని మార్పులు రాలేదు. అంగవైకల్యం కలుగలేదు. మొక్కలపై గూడా గ్రహణ ప్రభావం ఏమీ లేదని వారు తెలిపారు.

## హైదరాబాద్ నోట్‌బుక్

**రాష్ట్ర విద్యార్థిమండలి :**

శ్రీ టి. సుబ్బరామిరెడ్డి అధ్యక్షతన రాష్ట్ర విద్యార్థి మండలి అనే పేర ఒక సంస్థ ఏప్రిల్ 5 వ నెలకొన్నది. విద్యార్థులలో గర్భితంగా వున్న సాహిత్య, సాంస్కృతిక ప్రతిభను వెలికి తీయడం, రాజకీయాలతో సంబంధం లేకుండా పని చేయడం, క్రీడలకు, వ్యాయామ విద్యకు తగిన ప్రాధాన్యం ఇవడం ఈ సంస్థల లక్ష్యమని అధ్యక్షుడు శ్రీ సుబ్బరామిరెడ్డి తెలిపారు. ఈ సంస్థ సెక్రటరీ జనరల్ శ్రీ అశ్వినీకుమార్ ప్రధాన కార్యదర్శులు శ్రీయుతులు వి రామిరెడ్డి, వి నారయ్య, పి.వి. ఎస్ స్వామినాయుడు కోశాధికారి శ్రీ కె భాస్కర రావు.

**ఉపశ్రుతి**

ఆబ్బ ! ఉస్మానియాలో ఇంటర్నల్ అసెస్మెంట్ పీడ విరుగడైంది ! అన్నారొక పెద్దమనిషి నాతో. అసలు పరీక్షలు పీడే విరుగడయితే మంచిది. పూర్వం ఇలాటి పరీక్షలున్నాయా ? ఎవరికెంత ప్రాప్తమో అంతే అబ్బేది ! అన్నారు మరొక పెద్దమనిషి తక్షశిల, నలందాలను ధ్యానిస్తూ.

# ఎప్పుడైనా, ఎక్కడైనా విన్నారా?

ఎన్నో సంస్థలు, ఎన్నో రకాల పోటీపరీక్షలకు శిక్షణ ఇస్తున్నాయి కాని మా పరీక్షా ఫలితాల వంటివి ఎవరైనా సాధించారా? ఒక సారి కాదు. వరుసగావస్తున్న మా పరీక్షా ఫలితాలు చూడండి. ఆలోచించండి. 1979 మెడికల్ మరియు ఇంజనీరింగు ఎంట్రన్సు పరీక్షలకు మా వద్ద చదివి కృతార్థులైన వారి నంబర్లు

**1978 మెడికల్ ఎంట్రన్సు ఫలితాలు**

10034 10038 10225 10373 10375 10376 10548 10753 10821 10902 10911 10957 11158 11238 11416 12301 12304
12310 12351 12677 12721 12923 14073 14173 14322 14451 14461 14710 14852 14862 16026 16028 16075 16098
16222 16238 16258 16427 16433 16659 16757 16768 18015 18040 18050 18051 18057 18058 18075 18076 18078
18083 18093 18096 18108 18135 18175 18176 18183 18227 18320 18362 18373 18395 18396 18397 18415 18443
18447 18462 18546 18556 18592 18604 18752 18891 19094 21038 21389 21404 21408 21457 21483 21487 21525
21608 21611 21613 21687 21720 21722 21746 21749 23019 23059 23080 23083 23094 23099 23103 23111 23134
23288 23331 23368 23373 23447 23479 23484 23501 23509 23527 23560 23580 23581 23611 23721 23724 23768
23867 23872 23875 23954 24068 24146 24150 24160 24161 24164 24166 24167 24171 24174 24176 24231 24240
24337 24340 24347 24364 24443 24447 24483 24486 24515 24529 24533 24550 24553 24667 24669 24680 24684
24685 24717 24750 24808 24825 24833 24842 24854 24858 24863 24875 24879 24951 24961 25028 25051 25189
25215 25262 25283 25288 25290 25295 25296 25301 25348 25363 25401 25404 27132 27139 27143 27145 27174
27184 27200 27208 27211 27223 27293 27334 27335 27378 27383 27455 27647 27666 27668 27910 27954 27978
28039 28092 28208 28249 28254 29013 29024 29034 29044 29045 29048 29054 29077 29184 29195 29200 29286
29287 29288 29301 29354 29421 29671 29672 29716 29791 29792 29844 29899 30034 30076 57565

**1979 మెడికల్ ఎంట్రన్సు ఫలితాలు**

10059 10088 10092 10246 10253 10257 10321 10323 10348 10360 10423 10496 10511 10535 10538 10549 10573
10586 10604 10616 10680 10740 10742 10762 10767 10830 10969 11000 11016 11060 11061 11130 11139 11170
11195 11209 11213 11217 11257 11268 11348 20009 20072 20101 20114 20124 20138 20167 20177 20232 20235
20278 20282 20296 20297 20303 20304 20307 20343 20361 20484 20551 20581 20607 20756 20760 20811 20812
20846 20885 20915 20971 21000 21174 21210 21222 21278 21297 21315 21344 21389 21407 21415 21433 21506
21621 21629 21665 21758 21844 21900 21919 21933 21936 22040 22070 22071 22073 22099 22135 22139 22144
22167 22231 22247 22363 22386 22529 22545 22599 22610 22617 22618 30056 30087 30076 30093 30164 30269
30591 30594 30597 30768 30780 30335 30891 30927 40109 40121 40199 40216 40374 40404 40426 40450 40457
40612 40684 40719 40333 41079 41101 41308 41362 41376 41378 41385 41606 42251 42383 42633 42760 43957
44122 44129 44284 50050 50104 50261 50333 50345 50787 60039 60042 60044 60106 60135 60596 60645 60681
60689 60693 60722 60818 60837 60838 60896 61070 70031 70003 70015 70127 70163 70166 70197 70258 70308
70508 70514 70520 70536 70595 70609 70612 70668 70726 70731 70765 70807 70810 70940 70996 71131 71311
71332 71745 71833 71834 71836 71897 80051 80070 80090 80115 80219 80229 80248 80293 80331 80389 80413
80522 80823 80825 80332 80337 80904 81032 81096 81217 81274 81343 81360

**1979 ఇంజనీరింగ్ ఎంట్రన్సు ఫలితాలు**

424 983 1226 1453 1493 1572 1630 1997 2270 2560 2564 2616 2639 2719 2882 3013 3298 3299 3320 3559
3560 3694 3741 3828 3978 4117 4208 4350 4356 4456 5159 5145 5311 6326 6333 6385 6553 8002 9064 9080
9225 9696 11000 11224 11262 11376 11378 11485 11487

# రవి కళాశాల

బ్రాడీపేట—గుంటూరు-2

డైరెక్టరు
C. V. N. ధన్, M. A.,

ప్రిన్సిపాల్
C. ఝాన్సీ లక్ష్మీబాయి,
M.A., M.Ed., C.I.R.,

ఫోన్స్ : 20917, 21192, 21545, 24663, 24465

SUVARNA

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ యితర రచనలు పంపదలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీ నగరం, విజయవాడ—520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరు మీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి— హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి తొమ్మిది వారాల గడువు అవసరం.

★ కథలుగానీ, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు— వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలాబిళ్ళ లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక తొమ్మిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని—తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు— రచన పేరు— అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే, వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ళ లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు.. ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పడ్డ "ప్రతు"లను— కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

### కథలు

18—4—80వ తేదీతో వెలువడిన చంద్రమోహన్, తాళ్ళూరి కృష్ణకుమారిల ముఖ చిత్రంతో మా ముందుంచబడిన ఈవారం పత్రిక దేదీప్యమానంగా ఉంది. ముఖ చిత్ర ప్రచురణ విషయంలో, మీ శ్రద్ధ మిక్కిలి శ్లాఘనీయమైనది. ఇక పోతే కథలు వగైరాలూ, సీరియల్స్ రెండూ సాఫీగాసాగి పోతున్నాయి. కథలలో ఉద్యోగంవెయ్యాలి ఎంచక్కా ఉంది. త్రిపుర సుందరి విరచితమైన మధుర స్మృతి కవితలో హృదయవేదన, స్పందనలతో ప్రేమయొక్క లపునత్యం బాగా వివరించారు. సినీ పేజీలలో ఎందుకో ఈసారి జయసుధ, శ్రీదేవిల కలర్ ఫోటోలు చాలా బాగున్నాయి. పత్రికలో వాటిని ఎక్స్ప్లాయిట్ చేసిన తీరు ఆశ్చర్యం కలిగించింది రియల్లీ మార్వెలెస్. ధర్మపథం బులుసు వారు ఎన్నుకొన్న విషయంలో ఆస్తిక, నాస్తిక మత వివరణ బాగుంది ముక్తాలు దాశరథిగారి ...లో ...స్మరణంలోని పద వివరణ కదిలించివేసింది.

— ...త్తు సూరిబాబు, రాజావ [పిప్పర]

*

టి కృష్ణకుమారి, చంద్రమోహన్‌ల ముఖ చిత్రంతో వెలువడిన సంచికలో మూడు కథలూ మూడు విధాలుగా ఉన్నాయి. అందులో మొదటి కథ ఉద్యోగము చెయ్యను చిన్నదే అయినా చాలా చక్కటి నీతిని బోధిస్తుంది. ప్రతి ఒక్కరూ ఉద్యోగం కోసం పోరాడి, పోరాడి చివరకు నిరుద్యోగులుగానే మిగిలిపోతారు. ఉద్యోగం ... ప్రయత్నం ... సమయంలో స్వతంత్రంగా ఏదయినా చిన్న కుటీర పరిశ్రమ లాంటిది ఎంచుకొని ప్రారంభిస్తే సరి. ఇటు నిరుద్యోగ సమస్య పరోక్షంగా కొంత వరకు తగ్గించబడుతుంది. అటు కొంత మందికి ఉపాధి కల్పించబడుతుంటుంది కాని దానికి తగిన ...యాన్ని ప్రభుత్వం అందజేస్తే ... బాగుంటుంది ఉత్సాహం, పెళ్ళామ్మని ...రి, ప్రశ్నావళి ...కలు పత్రికకే హైలెట్. ఉత్తమ శ్రేణి పత్రికా విశేషాలు పి. వి. ఆర్. శర్మగారి మరణం సందర్భంగా వారికి ...మా శ్రద్ధాంజలి ఘటిస్తున్నాము

యు యు ఉదయరంగు [విన్నీగమారు]

### సీరియల్

... ముఖచిత్రం [11—4—80] చిరునవ్వుల ముఖ ... స్వయంవరం, రాంబసగంగ సీరియల్స్ రసవత్తరముగా నడుస్తున్నాయి మలుపు కథ నచ్చలేదు. సినిమా స్టిల్స్ బాగున్నాయి

కొండాల వెంకటేశ్వరరావు [ముదినెపల్లి] ●

**Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor . S Radhakrishna.**



















ధాన్యపు నగరంలో వారికింక భయం లేదు







అది అంతేలే. డిపీస్ స్క్వాష్‌లూ, సిరప్పులూ కుదేలు చేసేస్తాయి ఎవర్నైనా! మరి డిపీస్ కెచప్స్, జామ్స్ మరియు జెల్లీస్, టేబుల్ పైన దీన్ని కొట్టేది మరొకట్టి లేదు !

డిపీస్ లెమన్, ఆరెంజి, మేంగో స్క్వాష్‌లు, లెమన్ బార్లీ వాటర్, లైమ్ కార్డియల్, పైనాపిల్ క్రష్, రుచిగల రోజ్ సిరప్, ఫ్రాలిక్, పళ్ళ సువాసనగలది, మరింకా నోరూరించే యితర సిరప్పు రకరకాలు !

**డిపీస్ అసలైన పళ్ళరుచిగలది-**